# Sultana Chand Bi

OR

THE LAST DAYS

OF

AHMEDNAGAR

*AN HISTORICAL DRAMA*

BY

KOLACHELLAM SREENIVASA RAO

Pleader, Bellary.

SECOND EDITION.

PUBLISHED BY

*K. SATHRUGHNA RAO*

BELLARY.

PRINTED AT THE ANDHRA PRESS, BELLRAY.

1926.



[ Price Re. 1—0—0. ]

శ్రీ

# సుల్తానాఛాందుబీనాటకము.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారిజ్యేష్ఠపుత్రుఁడగు కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

రెండవకూర్పు.



బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1926.



వెల రు. 1—0—0

## శ్రీనివాససుకవి జీవిత చరిత్ర.

ఎవ్వానివదన రాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలుసలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితాసుకన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పిఱిల్లఁజేసి, వెన్నెలమిన్నయని వన్నెకెక్కెనో! ఏమహామహు దివ్యనామామృతమును వీనులారఁగ్రోలని యక్షరాస్యుఁడొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబులధరియించి దివాకరనిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో! ఏవిద్వద్వతంసుఁడు అనన్యజనసామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శియయ్యెనో! అట్టివశీకృత సకలశాస్త్రజలధియగు కోలచల శ్రీమల్లినాథసూరి వంశమున మన శ్రీనివాస కవిముక్తామణి విరూపాక్షక్షేత్రమునకు సమీపమునందుండు కామలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకము 13-3-1854 తేదిలకు సరియగుప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁడుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృత భాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయభాషయందసమానవైదుష్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగిగనుండి, తర్వాత న్యాయవాదిపరీక్షలయందుత్తీర్ణుఁడై, బళ్లారిపురవరమున న్యాయవాదిగ వర్తిలుచుండె. ఇతనికి నొక కూఁతురును నలుగురు కుమారులును గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7-వ తేది దేహాలీపురమున జరిగిన విద్వత్సభయని ప్రసిద్ధిఁగాంచి యాంధ్రసాహిత్యపరిషత్సభ కగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్లుండ నేతత్కవిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్రకువలయంబు వసివాడఁ గుకవిచక్రంబు ఉల్లసిల్ల 1919 సం॥రం జూను 23-వ తేదియస్తమించె.

ఇట్లువిన్నవించు సుధీజనవిధేయుఁడు,

రావాడ వెంకటరామశాస్త్రి

తెలుఁగు పండితుఁడు,

మునిసిపల్ హైస్కూలు, బళ్ళారి.

# నాటకమునందలి పాత్రలు.

## స్త్రీలు.

| | | |
|---|---|---|
| సుల్తానాచాందుబీ | - | బీజాపూరురాణి |
| జోరియా | - | దర్వీషుకూఁతురు |
| మేరి | - | ఆల్మేడాచెల్లెలు |
| భీమక్క | - | తిమలపాకులమ్మనది |
| లతీఫ | - | ఆప్జల్‌బేగు లంజ |

## పురుషులు.

| | | |
|---|---|---|
| ఆబిస్సుఖాన్ | - | సేనాధిపతి |
| ఆప్జల్‌బేగు | - | జంఁదుర్గము నబాబు |
| ఆల్మేడ | - | పోర్చుగీసు పాదరి |
| ఇస్మాలుముల్క | - | మంత్రి |
| యాక్లిజాఖాన్ | - | సేనాధిపతి |
| యాఖూట్ | - | ఉపసేనాధిపతి |
| హైయాతుఖాన్ | - | కొత్వాలు |
| హమ్మీదుఖాన్ | - | సేనాధిపతి |
| రంగానాయక్ | - | పాళేగాడు |
| భర్మానాయక | - | పాళేగారు |
| కుల్లునాయక్ | - | దొంగలదొర |
| పీనార్ఖు | - | ముల్ల |
| రఘునాథ | - | విప్రవినోది |
| వెంకోబాపండిత | - | వ్రాతఁగాడు |
| మీరుకాశీమల్లి | - | నవాబు |
| డాన్‌డియాగో | - | పోర్చుగీసు పాదరి |
| డానియల్ మిర్జా | - | అక్బరు కొమారుడు |
| సుల్తానుబేగు | - | ఆప్జల్‌బేగు తండ్రి |

ఖాన్ ఖాన్ ఈమొదలగు డిల్లీసేనాధిపతులు.

దొంగలగుంపు, భటులు.



# చాందబీచరిత్రము.

(భామినీరాజ్య నాశనము.)

ప్రథమాంకము.

నాంది. సూత్రధారుఁడు.

శా. శ్రీరాజిల్లఁగ నేసతీమణి ధరిత్రీభారముఁ దింప నా
ఘోరాజిన్ ఖలకూహకారివితతిన్ గూల్చెన్ మహాధీరయై
వీరావేశముఁ బూని శక్తియని పృథ్వీమాత కొండాడఁగా
నా రామామణి నిల్చుఁగాత జనచిత్తాబ్జంబునన్ నిత్యమున్.

కం. ద్వైతాద్వైతవిశిష్టా
ద్వైతాభేదతకు నిక్కువంబగు బ్రహ్మం
బేతఱిని నైకమత్యత
భూతలవాసులకుఁ గఱపి పుణ్యమొసఁగుతన్

సీ. ధీరులై వేదవిచారులై మంగళాకారులైమను పాపదూరులార!
మాన్యులై సౌజన్యధన్యులై సకలమూర్ధన్యులై వెలయు రాజన్యులార!
నిష్ఠులై శీలగరిష్ఠులై సుగుణభూయిష్ఠులై రాజిల్లు శ్రేష్ఠులార!
భద్రులై దానకల్పద్రులై సుగుణసముద్రులై రంజిలు శూద్రులార!
శ్రీగులై సౌఖ్యసంయోగులై సద్యశోభాగులై విలసిల్లు భోగులార!

తే. గీ. నందనందను, నాశ్రితానందు, శ్రితస
నందు, ముచికుందముఖభక్తబృందు, హరి, ము
కుందు, గోవిందు, నందితనందు, స్వాంత
మందునిడి సేమమందుఁడీ యిందునందు.

(అనుచు సభకునమస్కరించి నలుదిక్కులంజూచి.)

ఏమీ! నటిరాదయ్యెను? పనిబలమాయెఁగాఁబోలు! పనిలేనిపనికిఁ బ్రొద్దుచాల దనున నిజము. సకాలమునకుఁ బ్రారంభింతుమనిన నేదోయొక యంతరాయమువచ్చును.

(విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ:— (సూత్రధారునైగాదిగఁజూచి) అయ్యా! నీవెవఁడవు? ఏవ్యాపారమునకు వచ్చినాఁడవు? ఓడమీదవచ్చితివియా? గుఱ్ఱముపైన వచ్చితివియా?

సూత్ర:— ఏమోయి! పరిచయములేని వానింబలెనడిగెదవు? నీమిత్రుఁడను సూత్రధారుఁడనుగాదా

త్ర:— జాయ! భయమ్మదేల? మనశాస్త్రనిబంధన లార్యపాలితం
బై యొసలారుచున్న సమయమ్ములైన నష్టమ్ములైన ధర్మముల్.

టి:— సరి. బ్రదుకుతెల్లవారెను (నటినింజూచి) అన్నా! ఇపుడు మీవారితీరొకతీరుగనున్నయది. ఇంతకిపుడుదిగినవారు ముందెంతకుదిగుదురో? "తొంటకుదిరియూసరవెల్లి" యనునది నిజమయ్యె. పూర్వీకుల నిబంధనలు పూర్వపక్షము చేసిరి. మనశాస్త్రములే వీరికివలదట ఇకనీదారికి నీవారురారు.

త్ర:— ఓరీమూర్ఖా! ఈనారదాంశ యేలపూనితివి? అనునదియొకటైన నష్టమొకటి చేయఁదగునా? "కాలముకొలఁదిమార్పు తాలిమికొలఁదినేర్పు" అనునదియెఱుంగవే? పూర్వముండిన మహనీయులు శాస్త్రకర్తలిపుడుండినఁ గాలానుగుణ్యముగ వారువిధులవశ్యకముగ నేర్పఱచుచుండిరి. మనదురదృష్టమున నట్టివారనేకులికాలంబున లేరైరి. (నటినిఁజూచి) నటీ! అట్టి సందేహము నీకువలదు. మనోజయము మంగళము కావున మనము నాటకమునకుఁ బ్రారంభింతము.

టి:— అటులైనఁ గర్తవ్యాంశంబిపుడెద్ది?

త్ర:— గానయుతమైన ఋతువర్ణన. నటీ! నేఁబోయి రాఁదగినపాత్రలను సిద్ధపఱచుచుండెద. మనవిదూషకుఁడు నీకుసాహాయ్యముగ నిచటనుండును.

టి:— మంచిసహవాసము కుదిర్చితిరి. "ఇంగలముసంగతి బంగరకువన్నె. మంగలము సంగతి మడుగుకుమని" యను సామ్యంబయ్యె.

షా:— నటీ! అందుననేనెద్ది?

టి:— స్పష్టమగ్రేభవిష్యతి. నేఁజెప్పనేల?

(సూత్రధారుఁడు నిష్క్రమించును.)

షా:— (స్వగ॥) ఇపుడిచట నాథుఁడనేనైతిని (నటినిఁజూచి) నటీ! ఇటురా. ఏదినీగానప్రవీణత?

టి:— మంచిది.

కం. మల్లికలననలు రాజిలె
నల్లన భృంగములు వానినానుచు మధిరం
జిల్లఁగ గానము సేయఁగ
నిల్లాండ్రను వెదక సాగిరిలనువిరాగుల్.

షా:— హా! హా! ఎంతటిదీకాలమహిమ! విరాగులుసైతము సరాగులైవనితానురాగము గోరిరికదా? నేనెంతటివాఁడను?

బురుష } కామిని! యీమహిమాస్పదషట్పదగాన నైపుణికిఁ రహిఁ
త్తము. } నీ మృదులస్వనగీతముచేరెను నేరఁదాళఁగనింక నేఁ
గామునిఘాతికిఁ గందెదనేలవె కాఁతియల్పుడనీక యో
రామరో! "కంనవశీకురుతేభువిరామ" యన్నుడిచిత్రమే!

మల్లికానుసక్తమైన షట్పదతతిగానంబువిని విరాగులుసంసారులైరన ద్విరేఫగానంబునకుఁ జేరికగ నీకలకంఠరవంబు విననినాకు మనోధైర్యంబుచెదరెనని పలుకవలయునా! "నారీతినామమంత్రేణ కాష్ఠంనమతినిష్ఠురం" అని యుండెఁదన్నారీసాన్నిధ్యంబు బమ్మకైనను రిమ్మ తెవులుపుట్టింపదా? నామనోతాప మార్ప సరసివగు నీవే నేర్చిరివి. హెచ్చులాడఁజాల "నిజముకురుచ బొంకుపాపు" గనునవినవా? శరణని నీపసంజేరితి. నీళ్ళముంచెదవో పాలముంచెదవో నీభారము.

నటి:— ఓరీభ్రష్టా! నీవడక "నష్టస్యకాన్యాగతిః" యనులాగున్నది. ఈ దుష్యకుదుర్ఘరసన్యాయమునువదలి సుఖముగనుండుము. నీసరస నిఁక నేనుండఁజనదు.

(నిష్క్రమించును.)

విదూష:— అయ్యో! ఇఁకనాగతియేమి? ఎంతవిశ్వాసఘాతకుఁడనైతిని. ఇపుడాలోచించినఁ బ్రయోజన మేమి? "జాతిపడి నేలదూరనేల"? "జానెడు పోనేల మూరెడుతగ్గనేల?" ఏమి సేయుదు? ముందిద్దేశమునైనైన నేనున్నదికన్న సూత్రధారుఁడు ననుఁబట్టిచంపును. కావునఁ గాళ్లకుబుద్ధిచెప్పుటయె కార్యంబు. ఇపుడు బీజాపురమువారికి నహమ్మదునగరువారికి యుద్ధము జరుగుచున్నదఁట. వారిలోనొకరిదద్దఁజేరెద.

(నిష్క్రమణము.)

*

శ్రీ

# చాందుబీచరిత్రము.

ప్రథమాంకము - ప్రథమరంగము.

బీజాపురము.

సుల్తానాచాందుబీ - ఇబ్రహీంఆదిల్షా - ఇఖ్లాస్ఖానునుఖ్యు.

అబిస్ఖాన్ - సేనానాయకు - ఇంగాంస్ ఖాన్.

సుల్తానా:—మిత్రులారా! అహమ్మన్నగరు వారికినిమనవారికిని గలవైరము మీకెల్లరకుఁ దెల్లముగదా? వారు నాపుట్టినింటివారైనను నాపైలక్ష్యముంపక తమరాజ్యముపైఁ గల క్రోధాగ్నిని యీ రాజ్యనాశనకారణంబునఁ జల్లార్ప యత్నించుచున్నారు. జెట్టాయుద్ధమునకధికారి వారికిలోనై యహమన్నగరు సేనలగూర్చి మనతో యుద్ధమొనర్ప సమకట్టి కృష్ణాతీరమునఁ గలపల్లెలు కొల్లలు కొట్టుచున్నవాఁడని నాకుం దెలిసినది. మాసహోష్యవర్గమునఁ జేనజను లీరీతిఁగష్టపడుట కనులారఁజూచుచుండుట న్యాయము కాదు. కావునఁ గర్తవ్యంబు మానము విచారింపవలెను.

ఇబ్రహీం:- తల్లీ! రాజగు నేను బాలుఁడనయ్యును రాజ్యమేలు సామర్థ్యము లేనివాఁడనయ్యును వైరులు తెలిసినారు. వారిగర్వంబెల్ల నిర్మూలంబు గావించినఁదప్ప వారికిఁ దెలివిరాదు. యుద్ధంబున వారిరూపుమాపి రాజ్యము నిష్కంటకముగ నేలమేని జనులు రాజులమని మమ్మాదరింతురా? ఎవఁడైన శత్రువులనిడికొని సుఖముగనుండనగునా? తల్లీ! ఎటులనయినను మనసేనతో వైరులఁ దాఁకి యుద్ధమొనర్పవలెనని నాయభిప్రాయంబు.

అబిస్సు:—తల్లీ! మనరాజుగారి మాట శూరజనసమ్మతము. కావున యుద్ధమే కర్తవ్యమని నాకుఁ దోఁచెడు.

ఇన్సూ:—తల్లీ! సందియమేల? ఈ బాలుఁడు వచించినరీతి యుద్ధము కర్తవ్యమని నాయభిప్రాయము. భీకరవైరివారప్రాణసమీరము గ్రోలఁ జూచుమన దాక్షిణాత్య సేనయుండ, నరివీరమదాంధకారపరిహారకభాస్కరులై మనయాబ్సీనియన్ సేనలుండ మనకు వచ్చినభయమేమి? జయము మనదనుటకు సందియమేమి.

ఇబ్రహీం:—తల్లీ! ఈతూరియుద్ధమునకు నేనునుంబోయెద. జయమార్జించి తెచ్చెద.

సుల్తానా:—తనయా! నీవింకను బాలుఁడవు. యుద్ధమెఱుఁగవు. వైరులు తమప్రాణములకురోసి పైఁబడుదురు. యుద్ధమున రాజుండినచో వానినిఁ జంపయత్నింతురు. కావున నీవు రణమునకుఁ బోవుట తగదు.

ఇబ్రహీం:—తల్లీ! బాలుఁడగు నేను నిన్నెదిరించి మాటలాడితినని తప్పెన్నకు. యుద్ధమున రాజున్నచోఁ దమరాజు మన్ననఁబడయవలెనని సేనచక్కఁగ యుద్ధమొనర్చును కావున నేను యుద్ధమునకుఁ బోవుటచేయుదును.

ఇన్నూలు:—తల్లీ! మనరాజుగారిమాట సర్వజనసమ్మతముగ నున్నది. మీ కాబాలునిపైఁ గలయనురాగముచే యుద్ధమున నే యపాయముగలుగునోయని భీతిల్లుచున్నవారు. రాజాయుద్ధమునందారితేఱుట శ్రేయస్కరము కాదా!

సుల్తానా:—[రాజునుంజూచి] అనీలు! నీయిష్టానుసారంబొనర్పుము యుద్ధమున శరీరమెల్లఁ గన్నులుంచుకొని యుండుము. (మంత్రినిఁజూచి) ఇన్నూలుముల్కూ మనసేనను రెండుశాఖలుగ విభజించి దక్కన్ సేనయంతయును రాజుగారి వెంటనుండనిమ్ము. అబిసీనియన్ సేనయు రంగానాయకుని భటులును మన అలిస్సుఖాన్ క్రిందయుండనిమ్ము. ఈ రెండుసేనలు వేఱు వేఱు మార్గములుగఁబోయి శత్రురాజులను నిరుపక్కలనుండి ముట్టడించి యుద్ధమొనర్పనిమ్ము. ఆలస్యమునకుఁ గాలంబులేదు. వైళమ్మె సేననెల్లను యుద్ధమునకుఁ బంపుము.

ఇన్నూలు:—తల్లీ! మీయాజ్ఞశిరసావహించి యొనర్చెద. అటులైన నేఁటికార్యములింతకు ముగించివెళ్లెదము. కార్యములు మెండుగనున్నవి.

సుల్తానా:—అటులైన నరిగేము. (నిష్క్రమము.)

ద్వితీయరంగము

బీజాపురము.

ఇన్నూలుముల్కూ [మంత్రి.] ఇల్లాజూఖాన్ [సేనాధిపతి.]

యహూఖాన్ [ఉపసేనాధిపతి.]

ఇన్నూలుముల్కూ స్వగతము

ఉ. ఎన్నిదినంబులీగతిని నింతికిలొంగుచునుందునక్కటా
మన్ననసేయునట్టి యహమన్నగరీశున కేమిదెల్పుదున్
బన్నినయుక్తులన్నియును బమ్మెరవోయెను పొర్చుగీసువా
రున్నతెఱంగుఁజూడ మది యొప్పదు వారిజలంబుఁ గోరఁగన్.

(ఆలోచన నభినయించి) హా! ఏమిసేయుదును? ఆనారి నమలరాని వారికేళమై యున్నయది. నేనెన్ని మాయోపాయములు పన్నినను నాకే యవి యపాయావహములై పరిణమించుచున్నయవి. (ఆలోచించుచుండును.)

ఇల్లాజూఖాన్ ప్రవేశము.

ఇల్లాజూ:—[ఇన్నూలుముల్కూఁజూచి] సఖా! నీముఖభావంబు మనోవ్యాకులతను దీర్ఘాలోచనతయును సూచించుచున్నది. కారణంబేమి?

ఇన్నూ:—మిత్రమా! ప్రబలుఁడబలాపాలితుఁడగుట పన్నగమునకుఁ బక్షిరాజు దొరకుటకాదే? ఇది యనపేక్షణీయము గదా? మన యుద్యమంబంతయు నదోమయమై యూసరక్షేత్రమున మంచినబీజంబుమాడ్కి ఫలింపకున్నయది. గోవాధీశుల సాహాయ్యంబు గగనారవిందంబయ్యె. ఊరలవారిని వేఁడుట కొఱవిఁదలఁగోఁకికొన్నట్లగుఁగదా? రెంటఁజెడిన

కేవణరీతి రెండర్థాలా మనము చెడుదుము. ఇది యకర్తవ్యము. చంద్రాగమనంబు చకోరం బాశించి వీక్షించు భంగి మనమాటలునమ్మి యహమనగరాధీశుండు బీజాపూరు రాష్ట్రంబు దనవశ మెపుడగునోయని యెదురుచూచుచున్నవాఁడు. అది చందమామ గుటికలుగ విర మించునేమోయని చింతించెన. మనకు దీర్ఘద్వేషియైన " అబిస్సుఖాన్ " తనసేనతో నహిమూషికన్యాయమున జలదుర్గప్రాంతమందుఁ గాచినాఁడఁట. మనపరమమిత్రుఁడు " అఫ్జల్ బేగు " వానిసేనమండి యనేకభటుల విడఁదీయు ప్రయత్నంబున సఫలమనోర థుఁడనైతినని లిఖించెను. అంతటితోఁ గార్యమగునా? ఒకకలతోఁ జెల్లవాఱునా? ఇఁకమన మెవ్విధంబుననైన సమయసందుకట్టు కనిపెట్టి అబిస్సుఖానునుబట్టి తుదిముట్టించినచో మిగత కార్యంబెల్ల మనము తలఁచినట్టుగఁగదా? మిత్రమా! ఇట్టియాలోచనా జలధింబడి మునిఁగి తేలుచున్నాను.

ఇ॥ఖాన్ :—మిత్రమా! అబిస్సుఖాన్ పనితుదముట్టింప నెంతటిపని? సివంగిముందట నిట్టియా? ఆ యాలోచనవలదు. డాన్ డియాగో వద్దనుంబోయిన మనయాఖూబ్ ఖాన్ రానిమ్ము.

(యాఖూబ్ ప్రవేశము)

యాఖూబ్:-మిత్రులారా! వందనంబులు.

ఇ॥ముల్క్:-మిత్రమా! వచ్చితివే? కూర్చుండుము. అలసటఁదీర్చికొనుము. స్వాతివానకుముత్తెపుఁజిప్ప వేచినటుల నీరాకకుమేమెదురు చూచుచుంటిమి.

యాఖూబ్:-సఖా! నిద్రాభోజనాది సుఖదూరులై యహరహమాహవకేకిళిన్ దుర్గమాటవులంజొచ్చి విష మోపలస్థలంబులం ద్రొక్కి క్రూరారిశరవార ఘోరంబులకుం జిక్కి స్రుక్కి, యిక్కు మీఱి, పరభటుల ప్రాణంబులఁజక్కెరగా మెక్కి నిక్కి మాబోటియుక్కుగుండియల కెక్కుడి యలసట?

ఇల్లాజా:— ఔరా! శూరుల పౌరుషమిటులుండవలదా? మిత్రమా! నీవుపోయినపని యేమయ్యెను? పండా? కాయదా?

యాఖూబ్:-ఫలముఖముగనున్నయది. ఇదిగో డాన్ డియాగో గారిజాబు.

ఇ॥ముల్క్:-(జాబందిచూచుకొనుచుండును.)

ఇల్లాజా:— నేనునువినియెద. చదువుము.

ఇ॥ముల్క్:-మంచిది చదివెద. (జాబుచదువనారంభించును.)

మిత్రులారా! వందనంబులు. మీయభీష్టంబతిప్రయాసలభ్యంబు. మదీప్సితప్రతిఫలంబున కంగీకరింతురేని మీతలఁచిన కార్యలాభంబంద నేనందియుంబును లేదు. ధార్వాడరాష్ట్రంబు ధారాదత్తముగ నావశపఱచవలెను. నాలుగు లక్షలదీనారములిచ్చుట కొడంబడవలెను. లక్షదీనారము లిప్పుడందింపవలెను. యుద్ధభటుల వ్యయముమీయది. ధనాగార సంపూర్ణాధి కారంబు మీరువహించినపుడు మిగత మూఁడులక్షల దీనారములిచ్చుటకుబద్ధులై యుండవల యును. సంగ్రహలేఖయని నందియుంపకుఁడి, వివరములు మామిత్రుఁడుదెలుపును.

ముదగల్లు. డాన్ డియాగో.

ఇల్లాజా:— ఏమి! ఏమీ! ఒకటి రెండు పల్లెలుగావు ధార్వాడ రాష్ట్రంబఁట! అంతయంత ధనంబుగాదు నాలుగుకోటుల దీనారములఁట! పైపెచ్చు భటులవ్యయమఁట! ద్రవ్యనష్టము దేశనష్టము. ఔరా! దురాశకు మేరలేదుగదా?

ఇస్మాలు:—(ఆలోచన నభినయించి) మిత్రమా! అనాలోచితాభిప్రాయం బవధీరితంబుగావున నెద్దియను జక్కఁగవిచారింపవలెను. రాష్ట్రధనాగారంబు మనవశమైనప్పుడు నాలుగుకోటుల దీనారములిచ్చుట హెచ్చా? సమయమునకుఁగాని యుద్ధము సహస్రముండనీ వ్యర్థముగదా? అహమన్నగరుతో బీజాపురము కలసినపుడు ధార్వాడరాష్ట్రంబెంత? గోష్పదముగదా? భటులవ్యయము గణియింపమా ఇఁకలాభము విచారింతము. పాశ్చాత్యభటుఁడొకండు స్వదేశభటసహస్రమునకు భుజబలంబున సమంబని చెప్పనొప్పు. బుద్ధిబలతారతమ్యంబన్ననో హస్తిమశకాంతరంబు. పాశ్చాత్యభటవర్గంబరిభటోత్సాహభంగకరంబుగదా? "సర్వై రుపాయైః ఫలమేవ సాధ్యం" అనునది మఱచితివియా? స్వాతంత్ర్యము స్వర్గలోకమనునది యెఱుఁగవా?

ఇల్లాజా:— మిత్రమా! నీసిద్ధాంతంబు దీర్ఘాలోచనాజనితంబుగావున నవశ్యానుసరణీయంబు. ఈపని రహస్యంబు సుల్తానుచాందుబీబికిఁ దెలిసియున్నదేమోయని సంశయింతును. గోడకుఁజెవులు వాకిలికిఁగన్నులున్నవని కోవిదులు పలుకరా? వీనులలోనిమాట వేయియామడ వినఁబడునని నుడువరా?

కం. మనరాణి దనసి వినినన్
గనలుచుఁగాలాగ్నిమాడ్కి నుగ్రమ్ముగ మనపై
వినవే యానతిమహీశుం
బన సింహాసనమున కెవ్వ నరికరితతికిన్?

మిత్రమా! మనవార్తయింత వెలువడిన మనగొంతెమ్మకోరికలన్నియును వంతలగునుగదా! ఏకాంతమంతయు లోకాంతమగును.

ఇస్మాలు:— నిజము నిజము. మున్ను కన్నమిన్నగ నామెయందు గౌరవబుద్ధియున్నట్లు నటించి పయోముఖవిషకుంభప్రాయులుగనుండవలెను. మనసేనను రెండుభాగములుగవిభజించి యందొకభాగమునుగొని నేను మనరాజయిన ఇబ్రహింఆడిలును గలసికొనియెద. రాజాగారివద్ద చక్కని వినయములు పచరించి నమ్మకము హెచ్చించి యహమన్నగరాధీశుండెదిరినతఱి నడియుద్ధమున నాసేనతో నతనింజేరి నట్టేటఁబుట్టి ముంచినరీతి రాజునుఁబట్టిచంపెద. మఱియొకభాగపుసేనతో నీవు ఆలిఖానును జేరి జంబుకన్యాయమున మైత్రింబెంచి తఱివేచివానిఁ జంపుము. పిదప డాఁడియాగో తెచ్చినభటులను బురస్కరించికొని బీజాపూరు కోటను ముట్టడింతము. లోనున్నజనులకు ధనధాన్యజలంబులందనటు లొనరించినచోఁ దప్పక పానాయత్తతచే వ్యగ్రముగ క్షీణింతురు. కోటకు సురంగమునుంచి మందునించి కాల్చిన

లోకమునెల్లను మృత్యుదేవతకు నేకాహుతియొనర్చెదరు. నికపూవాడక ధనాధికారంబులు మనకునమరూరు.

ఇల్లాజ్:— అత్యవిహితముగదా నీమంత్రాలోచన. యుక్తికి శక్తికిలొంగు. సంతసించితి. వైరశుద్ధియొంపరికిం దీపుగాదు? సంతసము నగముబలముగదా?

ఇన్నాలు:—మిత్రమా! మనమంత్రాలోచన తెలిసిన శంకాకలంకకలితుండై యహమన్నగరాధీశుండే మియుం దోపకయుండును ఇప్పుడేవారికి మనయుద్దంతమును దెలిపెద. మనమింక వేయి కాళ్ళకొట్టులబలె నిలిచినచోట నిలువక "యేనకేన" న్యాయమునం గార్యము సాధింపవలెను.

యాఖూబ్:—మిత్రులారా! ధనాధికారార్జనమునకు నిది మంచియెత్తుగడ. అబిస్సుఖానును జంపువఱకు నే తిప్పలో తిప్పవేయను

ఇల్లాజ్:— మిత్రమా! డాక్టర్ డి యుగో గారికి బదులు వ్రాయుదువుగదా?

ఇన్నాలు:—అదినుంగూడనీవనసి, అటులనే ఆస్కిన్ బేగునకు వ్రాయుదును. మనమిపుడు వెళ్లుదము.

౬౦. తలంచినపని తలంచినయటు
ఫలియించిననది భాగ్యఫలము సకేవ
యిలసౌమ్య! మీకును రాణికిం
దలయెత్తిన వెలంతనడంచి ధన్యుండనగుదుక్.

(విపర్గీతము.)



# చాందుబీ చరిత్రము

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

ముసగిల్లు.

పావిరిడాక్డియాగో (స్వగతము)

సీ. అలసుధాంశువిలాస కలితాననవికాస
చంపకసుమనాస చారుహాస
అంచితనిటల భాక్కుంచితకుంతల
యపరాష్టమీశశాంకాభనిటల
చామీకరోపమ చంచలాసమదేహ
నవకోమల మృణాళనాళబాహ
మదమత్తహంసాప మానరంజితయాన
చకితచారుకురంగ శాబనయన

తే. గీ. బాల, శైవాలసమరుచినీలకేశ
జాల, లవలీదళకపోల, లీలనవల
మేలువిలుకాని కేళినిఁ దేలకున్న
నేలనామేను? జాలినేఁజాలఁదాళ.

నాచిత్తము చిత్తజాయత్తమై యమ్మత్తకాశినియగు మేరి యందుహత్తినది. ఆబంగరుబొమ్మ నవతారుణ్య లావణ్య శృంగారంబసదృశముగదా? ఆ గాంగేయాంగ భోగాభోగ సంయోగసుఖంబుల ధిక్కరించి యోగినిఁబలె రంగారు చెంగావివలువలద్ధరించి తన బంగారుప్రాయంబు జాజులుమంగలమ్మున వేఁచినరీతి నింగలమ్ము పాలుసేయుచున్నయది. యౌవనవిభవమ్ము వనమ్మునఁ గాచిన వెన్నెలంబలె వమ్ముసేయుచున్నయది. అలరులవిలుకాని కలుకుటలుగులఁజిక్కి విరాళినైఁ(పనోపక యాయరాళకచనుఁగాంచి వాల్యాపుల నేఁ జాపుసన్నలయిన నాచిన్నెలాడి చూడదు. నాయుదంతం బాఘననితంబినికిముఖాముఖిఁ దెలిపెదనన్నన్నో యాశాతోదరి సోదరుండు సదాదాని నెడఁబాయకుండు. ఏమిసేయనగును?

(ఆలోచననభినయించి.)

క. సరి సరి కర్తవ్యంబిది
దరిఁగంటిని వరదఁబోవుదారిని నిఁకఁ బా
దరిసోదరునింబంపెద
సరసిజముఖినెట్టులనైన సాధింతువెసన్.

గోవాయధికారులనేకులు నామాయావాగురకుఁ జిక్కినవారు కారా? ఇష్టార్థసిద్ధికి ససత్యంబు పచింపనివారెవరు? సోదరునియెడ బాటున నాజడజాక్షి నాకొసఁగఁబడదేని జడుపేల ? బలాత్కారమున్నదిగదా? నాదిలాఁదినజాబిపుడే వ్రాసెద.

( జాబు వ్రాసి చదువును )

భ్రాతృవరులారా !

తమయానతి శిరసావహించి మనజాతిమహిమఖ్యాతికారతఁబూని యాఱునెలలయ్యెనుగదా ? ఇచ్చటియధికారి యుచితానుచిత జ్ఞానవిహీనుఁడై గౌరవాగౌరవములపై దృష్టియుంపక స్వేచ్ఛానువృత్తి ననుసరించియున్నవాఁడు. వానిచర్య మనమతగౌరవ విపర్యయముగ నున్నయది. పారసీకులు పాయుబు వానిపరమమిత్రులు. మనమూలపురుషులచే విదేశములందుఁ జిరకాలాని ప్రయాసస్థాపితములగు పీఠములకు నవమానతయు, మతమునకుఁ గళంకంబునుఁ దెచ్చుటకు నిట్టిదుష్టుఁడొక్కఁడుండినఁజాలు. వాని సోదరి పాదరిగనటించినను, జార్వాకులం జేరి పెఱదారిపట్టినదను గాలివార్తగాన్నాఁడను. నిజమునిలుకడమీఁద నెఱుంగనగు. ఇట్టిమిథ్యమని యిపుడు నిర్ధారించుటకుఁ గారణంబు లేవు. అందమవసింపఁ గారణంబునురీతి నుండిన నుండ వగును. ప్రస్తుతమీయాల్మేడాను గోవాకురప్పించికొని విచారణాధ్యక్షులయెదుట వీని నుంచినచోఁ దగినసాక్ష్యము సిద్ధముగనుండును. మేరియా విషయమిఁకఁ గొన్నిదినంబులు దూచి వ్రాసికొనియెద.

తమవిధేయుఁడు

ముదగల్లు. డాన్ డియాగో.

(మరలనాలోచించి) ఇంతేదోషమ్మునులేదు. ఇంతకంటెనధికంబు సందేహాస్పదంబు. (జాబునుడచి) ఇఁక బీజాపూరు విషయమాలోచించెద. ఇన్నాళ్లుముల్క నాయిష్టార్థంబు నెఱవేర్పసిద్ధపడెను. ప్రస్తుతస్థితిగతులు చూచిన బీజాపూరు నశించునని తోఁచెడు. కాకతాళీయన్యాయముగ నా సాహాయ్యమువలనఁదన్నాశము సిద్ధించినచో ధార్వాడరాష్ట్రంబునకు నేనురాజునగుదు. గోవాకారాధికారి మద్బంధువుగదా? వానిచేఁ జెఱనుండు మద్దేశీయులనుగొందఱిని విడిపించి వారింగూడి నామిత్రులకు సాహాయ్యపడెద. సాహసముచేసెద నిపుడీ జాబునంపెద.

(నిష్క్రమము.)

## ద్వి తీ య రం గ ము.

### ముదగల్లు పాదరీలగుడి.

ఆల్మేడా (పాదరి). మేరి (ఆల్మేడా చెల్లెలు) డాన్ డియాగో (పాదరి) టీకు—బాలికలు—సేవకులు—భటుఁడు.

ఆల్మేడా:—(పీఠముననిలిచి)

ఆ. వె. తెలివితేటలుండి తెలియఁజాలరు భూరి
మాయయనెడిపొరను మూయఁబడుచు

దేవ! నీదుదివ్య భావంబు నెఱుఁగరు
కానఁబో ప్రియమయ్యె జ్ఞానమొసఁగి.

భ్రాతృవరులారా! అజ్ఞానాంధకారమునంబడి దారితప్పి యంధులంబలెఁదిరుగు శరీరధారులకు జ్ఞానంబను జగద్దేదీప్యమానంబగు దీపంబుఁజూపి పాపాత్ములనుమరక్షించెనుగదా యాగరిష్ఠదైవంబు. కలుషాంబునిధినిమగ్నులైన యీభూలోకజనాళికిఁదెప్పయై వారిముప్పుఁదప్పించిన పరమపురుషుం డాగరిష్ఠదైవంబుగదా! ఈసృష్టిలో విశిష్టజనులు దుష్టచేష్టాప్రవిష్టులై జరామయాదికష్టములచే నికృష్టులైయుండ నట్టివారికి సర్వోత్కృష్ట పదవినిచ్చుటకైయిష్టమిత్రునింబలె జన్మించి వారికష్టములఁదొలఁగించి ముక్తిమార్గ ప్రవిష్టులంజేసెనుగదా యాగరిష్ఠదైవంబు? ఇట్టిదైవంబును శేలుంబవల్లు నయవినయభయభక్తుల భజించుటకన్న నితరంబేమున్నది?

(అనుచు నిమీలితనేత్రుఁడై నిలిచియుండును.)

(భటుఁడొకఁడు ప్రవేశించి యొకజాబు డాఁడియాగోకిచ్చును.)

డా॥ డి॥:—(జాబునందిచదివి తలయూఁచి విషాదమభినయించి ఆత్మేదానుజూచి) సోదరా! దైవగతి విచిత్రము. తగ్గుముగ్గు లేరికిఁదప్పవు. తానొకటితలఁచిన దైవమొకటితలఁచుననునది నిజమయ్యె! అకటా! వాతాంబుపర్ణాశనులంబోలు పునీతులకేనా యిట్టికష్టంబులు?

ఆత్మేద:— భ్రాతృవరా! ఏమియీవ్యసనము? ఆజాబునందు విషాదోదంతంబెద్దియైన నున్నదియా?

డా॥ డి॥:—మిత్రమా! ఉన్నది. ఈపాపినినేనే యవ్వార్తనీకుండెలుపునది విధాయకముగనున్నది. నీయుపన్యాసంబిఁక నుపసంహరింపుము. "నచదైవాత్పరంబలం" అనునదినీవెఱుఁగనిదియా? రానున్నది రాకనిలుచునా?

ఆత్మేదా:—సోదరా! సందేహవార్ధిలో నన్ముఁద్రోయకు. అంతటివిచారకరమైనవార్తయేమి?

డా॥ డి॥:—(స్వగ॥ తెలిపెదను యత్నములేదు) సోదరా! నిన్నీయధికారముకునుండి పైయధికారులు తప్పించినారు.

ఆత్మేద:— న్యాయం చేనిందనారోపించినారు?

డా॥ డి॥:—మిత్రమా! వివరములధికారులు వ్రాయరు? జాబందిన తక్షణముననే నిన్నుగోవాకుఁ బంపునటుల వారియాజ్ఞ.

గీ. లెమ్ము లెమ్ము పొమ్ము వమ్ముగాదిది సమ్మ
తమ్ముగాదు; నీవు తడసితేని
యమ్మహాధికారు లతికా్రులగువారు
రమ్ముపయనమగుచుఁ బొమ్ము మిత్ర!

మిత్రమా! అధికారులెంతటి దయాశాలురో నీకుఁదెలియునుగదా?

ఆల్మేద:— ( స్వగతము ) దైవసంకల్పమిది. కాని కాలంబున నందఱుగారివారే! అధికారులంగటి క్రూరులైన నేనేమిసేయఁగలను? మంచిది. నిష్కళంకునకు నిందలభయమా? (డాన్ డియాగోనుఁజూచి) ఈమహాధికారముద్ర నిదిగో కొనుము. (అనుచుముద్రనిచ్చును.) మిత్రమా! ఈదినమున నేప్రయాణమగుట సాధ్యమా? లేనికి లేదిని దే ప్రయాణమనియున్నది గాని మానవునకు నదిశక్యమా ?

డా॥ డి॥:— అధికారులు గడిగడియ రొన్నుచుందురు. ఆతప్పుపోయి యీతప్పుపైఁగప్పినముప్పగు. ( మేరియానుజూచి ) మేరీ! ఆయధికారులకేల నీపైనింతక్రౌర్యము? హా! అయ్యో! ఈప్రకారంబుమీఁతి నీవుపోఁజనదని నిర్బంధించినారు. అకటా! ఎంతటికాఠిన్యమిది ? ఉండనిమ్ము అంతటి కరుణావిహీనుఁడనా నేను? వలయునప్పుడు నాయనుమతిఁ బొందుము. వెలివెడలుటకు నేసమ్మతించెద. అధికారులు ననుదండింపనిమ్ము.

మేరి:— సోదరా! ఇదినీయనుగ్రహమని యెంచెద.

డా॥ డి॥:— ( ఆల్మేడానుఁ జూచి ) సోదరా! నీవుపైళమ్మో పయనమ్మగమ్ము (మిగతవారిసందఱినిఁ జూచి) భక్తులారా! ప్రొద్దైనది. మీమీమందిరములకువెళ్ళుఁడు. నేనును నాకార్యనిర్వాహక స్థానమునకు వెళ్ళెదను.

( ఆల్మేడా మేరీతప్ప మిగతవారు నిష్క్రమింతురు )

మేరియా:—

శా. అన్నా! నిన్నెడఁబాసియుండఁగలనే? యాపన్నున్నన్నునీ
వెన్నండేనివియోగవార్ధినిఁ బడన్ వేయన్గలావంచు నే
నెన్నంగాదె! దురాత్ముఁడొకలుఁడు నన్నేకాలమున్గాంచిఁక
న్నన్నల్పేయుచునుండుఁగాదె? యిఁక నేకన్నీరుగారించునో?

( కన్నీరుఁగార్చును. )

అన్నా! గోపుచ్ఛన్యాయమునఁ జన్ననాఁటినుండి యెన్నఁడునిన్నెడఁబాయని నాకీనాఁ డీయెడఁబాటు కలిగెనే? ఏమిసేయుదు? నేనొంటరిగనెటులుందును ? ఈడాన్ డియాగో యెప్పుడును ఘూకాక్షీన్యాయమునఁ గిడుచూపుననుఁ జూచుచుండును. నీ ప్రాపున నాకేయాపదరాదను మోదమునమంటిని. నాముదంబునకుం తుదికలిగె.

ఆల్మేద:— చెల్లెలా! బాష్పములురాల్పకు. వచ్చినకర్మము వలదనినఁబోవునా? పయనమునిలుపనగునా? ఆజ్ఞోల్లంఘన చేయఁదగునా? సోదరీ! మేరీ! నామారుగ నినుఁ గాపాడుచుండునటు మన టీకూగారిని యడిగికొనియెద. వలదీదుఃఖము. వలదు. ఇప్పుడేనేఁబోయి టీకూను పిలిచికొనివచ్చెద.

(ఆల్మేడా నిష్క్రమము.)

మేరి:— హా! చిరతటినీపద్ధిలో మునిఁగితిని? నాపాలిటితల్లి వర్జిన్ మేరి నాపైదయతప్పను తల్లీ! వర్జిన్ మేరీ!

ఉ. నిన్నువలంచి నిందుముఖి నీపదపద్మములన్ భజింతునో
యన్నులమిన్న! నీవిటుల నాదరతన్ ననుఁజూచెదేల? నా
కెన్నఁడు నెట్టికష్టమున నేయఁడఁబాటును గాని లేని నా
యన్నకు నిట్టిఖిన్నతను నంపహీలంగను జేయనేలొకో!

హా! మాతా? వినాపనదీక్షఁబూనిన దేవివి నీవు గావా? ననుఁ బ్రోవ దిక్కెవ్వరుగాక మరేమి

డా॥ సి॥:--(మఱుఁగున దాఁచికొని) స్వగతము.

ఔరా! దీనియంగసౌందర్యంబు త్రిలోకమోహనకరంబు. గానవిజ్ఞానంబన్ననో యనూనంబు. ఈత్రిలోకమోహిని సరసముండుతఱి సూనశరుని కేళినిఁ గూడక మానినమానవుని జన్మంబు హేయంబు. విటదృష్టికంటకముగదా యీవధూటిచూపు. (ముందువచ్చి మరల వెనుకకుం బోయి యించుక యాలోచన నభినయించి) మతాచార్యుండనైన నేమి? విషయాధీనుఁడనుగానా? ఆ వారిజాక్షి హృదయం బెవరెఱుఁగుదురు? ఆతరుణి ననుఁగరుణించెనేని నీధరణిని నాకంటె ధన్యుఁ డితరుఁడెవఁడు? కావున ప్రారంభమున దియ్యనినెయ్యంపుఁ బలుకుల నయ్యువిదనియ్యకొలిపి ప్రద్యుమ్నక్రీడకుం బ్రార్థించెద. ఆదరింపదేని సోదరుని నధికారులచేఁ జంపించెదనని వాలివాఁడితనంబుఁజూపి భీతిఁగల్పించెద. అదియును ఫలింపదేని బలవంతమ్మున్నదికదా? వెలి పెట్టెనేని ద్వేషకారణము నారక్షణగనుండును. ఈ లేనిపోని యాలోచనలిపుడేల? హృదయమా! బెదరకుము. ఈదినంబుననే నిన్నానందవార్ధిం దేల్చెద.

ఉ. సుందరిమేరినింగనుచుఁ జొక్కెడుమానసమా! మఱుందు నిన్
జిందరవందరన్ బఱపి చేయువికారము సైఁచి ధైర్యమున్
బొందుము, యిప్పుడేనుజని పొంకపుమాటల బోటిఁగూడి యా
నందరసాబ్ధిఁ దేల్తునిఁక నమ్ముము నానుడి పోడిమిన్గదున్.

( మేరిసరసకుంబోవును. మేరివడఁకుచు లేచినిల్చును. )

మేరీ! లేవనేల? భీతిలనేల? నేనన్యుఁడనా? కూర్చుండుము. నేఁడుగదా నావీనుల తనివిదీఱ నీ యసమానగానంబు వింటిని.

మేరి:— సోదరా! నీకు నాయందుఁగల ప్రేమాతిశయంబట్టిది కాని నిజముగ గానమునందు నేనంతటి నేర్పరినిగాను.

డా॥డి:— (అ॥ గ॥ మోహాతిశయంబనిన బాగుగనుండెను.) ( ప్రకాశముగ ) మేరీ! నీపైనాకుంగల ప్రేమాతిశయంబునకుం గారణంబు నీసౌందర్య గుణాతిశయంబ.

మేరి:— సోదరా! నాసౌందర్యంబన నెంత? నాగుణగణంబన నెంత? సర్వంబునకు పర్టిజా మేరికదా కారణంబు? అన్నా! గోహాయధికారులు మత్సోదరునిఁ బనినుండి తప్పించిరేల? ప్రాణంబున్న మరలివచ్చునుగదా?

డా॥డి:— మేరీ! నీయన్న నిరపరాధియని మృత్యువుబారినుండి తప్పించికొనివచ్చుభారంబు నీపైనున్నది.

మేరి:— అన్నా! అదియెటుల?

డా॥డి:— అడుగనేల? అదికరతలామలకముగనున్నది.

మేరి:— ( స్వగతము॥ ఇదియేమోదురాలోచన.) ( ప్రకాశముగ ) అన్నా! నీమాట లనర్థములు గనున్నవి.

డా॥డి॥:—అనర్థకములుగావు. సార్థకములే.

మేరి:— ఏలాగు?

డా॥డి॥:--(నగుచు) లలనా! లావణ్యతారుణ్య శ్రీసహితవు నీవుగావా?

మేరి:— ఉండనగు. దానికేమి?

డా॥డి॥:— యౌవనధనసంపన్నుఁడను నేఁగానా?

మేరి:— (తలయూఁచి) అయిననేమి?

డా॥డి॥:—సుందరీ! మరల విచ్చి చెప్పవలెనా? నీకుఁదెలియదా? మాయిరువురకు శరీరసంబంధంబు గలిగినచోఁగుందనంబు బంగరునందుఁ బొందించిన యందమగునుగదా? చంద్రచంద్రికాన్యాయమున నుండనగుఁగదా! కన్నులున్నపుడే కాటుక, జవ్వనమపుడే సుఖము.

మేరి:— అన్నా! ఏమిమాటలివి? సర్వసంగపరిత్యాగినై దైవసేవక దీక్షవహించిన యాచార్యురాలను నేనుగానా?

డా॥డి॥:—(నగుచు) నేనున్నట్టి యాచార్యుఁడను. కావుననే సంబంధము చక్కఁగఁగుదురును.

మేరి:— (కినుకతో) అన్నా! నన్నింతచులకనఁజూడకు. ఇట్టిమాటలాడకు.

డా॥డి॥:—అలికులవేణీ! అలుకవలదు. ఆలోచనలేక పలుకవలదు.

డా॥డి॥:-సీ. అలరులవిలుకాని చిలుకులకునుజిక్కి
వెలఁది నీకలయిక వలచినాఁడ

మేరి:- యమదమాదులమించు విమలాత్ముఁడవునీవు
సుమనాశుగాళికి స్రుక్కనగునె?

డా॥డి॥:- తరమటే తరుణి! యీతనుతాపమోర్వఁగ?
శరణనువాఁడను కరుణఁగనుమ!

మేరి:- వలదురా యీకోలఁదలపకురాయన్న!
కలకాలమిలుఁగాల్చు కలుషమిదిర

డా॥డి॥:- తాళఁజాలనుబాల! జాలమేలోకోచాల?
లాలింపవేనను లోలనేత్ర!

మేరి:- సరసముగాదిది సరసకురాకురా దురితాత్మ!
యఱుగుమా దూరమగుచు

డా॥డి॥:- వాదములను బెంచి కాదనఁబోదు నే!
యాదవ్రతను తాపమాచరించంప

మేరి:- అసగతమతి! యిది యనఘుతియగును రా
యపలాపములనాడ నఘముగనవ

డా॥డి॥:-గీ. బాల! నీకేల? వదలుమా గోలతనము

మేరి:— కూళ! నీకేల? యీలీల నాలితనము

డా॥డి॥:--- లోలలోచన! యాలములేల చాలు?

మేరి:— మేల? యోఖల! కలుషాలవాల ముదిర.

డా॥డి॥:—మత్తేభయానా! ఇట్టిమాటలఁబ్రయోజనమ్ములేదు. ఇది సుఖానుభవసమయము. నీజవ్వన మటవీచంద్రికాన్యాయమనుటఁగనుట నాబోటి యౌవనాఢ్యునకు సంకటకరము.

మేరి:— సోదరా! మతాచారగతులను మతకరించి యిట్టి వెతల సుగములఁగోరుటతగునా?

డా॥డి॥:-- సుందరీ! సతతము నీసంగతియె నాగతియని మతిఁబూనిననాకు మతమేల? మాన్యతయేల? వేదండయానా! ఎందఱు మతాచార్యులు సరిసిజాక్షులతో సంబంధముగల్పించికొని విదేశములందు వేదాంతోపదేశకులుగ సంచరింపరు? జనసామాన్యమునకు వేదాంతోపదేశకుఁడగువాఁడు తనవలచినవనితకుఁ గామశాస్త్రోపదేశకుఁడు గాఁగూడదను విధియున్నదియా?

మేరి:— ఓరీదురాత్మా! నీమతము "భ్రష్టస్యకావాగతి" యనువానిమతమనుసరించినది. ఇదియధర్మము. "ధర్మహీనేకుతస్సుఖం" యనునదివినవా?

డా॥డి॥:-- సుందరీ! మేరమీఱు మారుసుఖంబులు చూఱఁగొనుతఱి నీవిపరీతపరిభాషలేల?

మేరి:— మానవాధమా!

కం. మానావమానములఁగతి
కానక కామాంధ! నీవు కరిసామ్యుఁడవై
స్నానముచేసియు దూళిఁ
మేనెల్లనుజల్లికొనుచు మెలఁగుటమేలా?

దురాత్మా! స్మరాపస్మారుండవై విహితావిహితములు వివేచింపక చిరకాలమార్జితంబగు మతనిబంధనల మతకరించు నీమాయలుమానుము. ధీరత్వమూనుము. "పేరుగొప్ప ఊరుదిబ్బ" యను లోకోక్తికిలక్ష్యభూతుఁడవు కావలదు. కడవపాలును విషకణమొకటి చెఱచినట్లు కడలేనికీర్తికిఁగళంకము తేకు. మతాచార్యుఁడవని పేరునొంది. యీవిగతవివేకాచార్యుండవను కుందునఁకుందవలదు. నీరీతి "చేసేదిశివపూజ దూరేదిదొమ్మరగుడిసె" యనువానినడి ననుసరించినది. ఇఁక నీమశ్శీలతాశ్లీల వాక్యంబులువలదు.

డా॥డి॥:-- వేదండయానా! వేదాంతహితబోధనలకిది వేళకాదు. నీమధురవ్యానుడులే ప్రమాణములు

లగ్నోగ్నేని "ఋక్షము ప్రాణము ఆచార్యాధీన" మను నానుడి కేల ప్రాశస్త్యంబుగలుగరాదు? కలిగెనేని నీ యూర్ధ్వ ప్రాణంబులు మదధీనంబులుగదా? మదగజయానా! మమ్మునిరోధుడు పదును ములుకులచే నాను దికుమును చెదరెను. జాగు సేయఁజాల.

మేరి:— ఓరీ కష్టాత్మా! నీయుఛ్ఛృంఖల వాక్యంబు సేవినఁజాల. నీచర్య "నభూతోనభవిష్యతి" యనునట్లైనది. పంచశరభూతావేశత నీవిప్పుడు ప్రపంచమే మఱచితివి. ఫీ! మలినాశయా! ఇందుండి వెడలుము.

డా॥డి॥:—కం. లాలనగుమీ వాగ్జాలము
హాలాహలలీల నీకు నగు నెటులుచి?

మేరి:— ఫీ! కాలానలముఁ బాలిశ!
మేలగు నే గ్రోల? నేల మేలములింకఁ?

డా॥డి॥:—లలనాలలామా! లాలనవచనజాలంబు నీకు రుచింపదు. ఇఁకవాలాయమేపని. (అనుచు సమీపించును.)

మేరి:—కం. మేలా యీవాలాయము?
కూళా! యింపగు నె కాలకూటము గ్రోలఁ?

డా॥డి॥:— బాలా! బలవంతమ్మున
గోలని నినుఁగూడి మరునిగీటడఁగింతుఁ.

(అనుచు సరసకుంజని కేల్పట్టియీడ్చును)

మేరి:— హా! పాతకా! దురాత్మా! నన్నంటకు. అకటకటా! (యఱచి నేలపై మూర్ఛిల్లును).
(దూరంబున గోడ మఱుఁగున నిద్రించు సేవకుఁడు లేచి యటులిటులఁగని)

సేవకుఁడు:-[స్వగతము] ఏమియిది నాతల్లి మేరీధ్వనిగనున్నది? ... ... ...
తల్లీ! మేరీ! ఎచటనున్నావు? ఏలయఱచితివి? [అనుచు సమీపించును]

డా॥డి॥:--[స్వగ॥] ఈశనైశ్చరుఁడు సుఖకంటకుఁడుగా నెచటనుండి వచ్చెను? (అనుచుఁ బరుగిడును)

[ఆల్మేడా టీకూలప్రవేశము]

ఆల్మేడ:—[నేలఁబడిన చెల్లెలినిఁజూచి సేవకునిపైఁ గనులెఱ్ఱచేసికొని.] ఓరీ! నాచెల్లెలేలయఱచి నేల వ్రాలినది? చెప్పెదవా? నినుశిక్షింతునా?

సేవకుఁడు:-[వడఁకుచు] తండ్రీ! కారణము నాకును దెలియదు. మఱుఁగున మైమఱచి నిద్రించియుంటిని. ఈతల్లియఱచెను. ఆధ్వనివిని నేవచ్చునంతలో మీరునువచ్చితిరి. ఇచట మఱెవరును లేరు.

ఆల్మేడా:-[చింతించి మేరికిగాలి విసురుచుండును. మేరీలేచి తనసోదరునిఁజూచి కన్నీరుఁగార్చును]
మేరీ! కన్నీరుగార్చెదవేల? నేలపైవ్రాలితివేల?

మేరి:— అన్నా! నాపాలిదైవంబుటలె సాక్షాత్కరించితివి. హా!

కం. హతభాగ్యను మననేలా?
క్షితికిఁ బరువుగను వలదుజీవమికను; దు
ర్గతికినను గురిఁజేసిన
మతిహీనుని మొగముఁ జూడ మానితమగునే?

ఆల్మేడ:— సోదరీ! ఏలయీవిచారము?

మ. విపరీతంబగు నీవిచారకరమౌ వృత్తాంతమేమమ్మ? నీ
కృప నాపైఁగలదేనిఁ దెల్పెదవుగా? కీడేమియున్ లేదుగా?
యిపుడీమిత్రునిఁ దోడి తెచ్చుటకు నే నేగన్ నిరీక్షించియే
యుపచారంబొనరించె నే కతిచుఁడా హా యింతగాఁ జెగ్గెలా!

మేరి:— సోదరా! నాదురదృష్టమునకు నీవు పరితపింపవలదు. ఆ పంచమాధముండు, ఆయవాచ్యుండు, ఆపాపి డాన్ డియాగో యుచితానుచితంబులెఱుంగక కేలుదండంబులాడి "కామాతురాణాంనభయంనలజ్జా" యనురీతినటించి కల్లుదాగిన కపిబలె, కళ్లెములేని గుఱ్ఱముబలె, విడిబడి నామానభంగమొనర్ప సమకట్టెను. అఖలుఁడు నా కేలంటినవెంటనే గోవ్యాఘ్రన్యాయమురీతిఁ, గటికచేతిగొఱ్ఱియుబలె, యూపగతపశువుభంగిఁ గడగడవడఁకి సోలి నేలవ్రాలితి.

ఆల్మేడ:— హా! హా! హతకా! దురాత్మా! హంతవ్యుఁడవునీవు. ఈదినంబున నాచేనీవుహతుఁడవు. మానబలికిరక్తబలి [అనుచుఁ డీకూ చేతనున్న దుడ్డుకఱ్ఱ గుంజుకొని వెళ్లును]

మేరి:— ప్రియసోదరా! శాంతము. శాంతము కోపముపాపమూలము. [టీకూనుఁ జూచి] అన్నా! నాయన్నవలదన్నను వెళ్లెను. కుటిలత్వముగూడుగఁ గుడుచు నాదురాత్ముఁడు డాండియాగో మఱియేమి పదభ్రమముముంప నెనరుపెట్టునో? అయ్యో! నాసోదరునెటులైన నూఱడించి యిటుపిలిచికొనిరమ్మ.

టీకూ:— తల్లీ! భీతిలవలదు. నీయన్నకుఁదోడుగ నేవెళ్ళెద.

[నిష్క్రమణము.]

(ఆల్మేడా, టీకూ మరలప్రవేశింతురు.)

ఆల్మేడ:—(హా! హా! యని యుసురువిడుచుచుఁ గట్టిపారవైచి) హా! హా! ఆకులనాపకుఁడు దొరకఁడయ్యెనే? వానిప్రాణానిలంబుగ్రోలునంతవఱకు దవదావంబు బొలెదందహ్యమానమగు నాదేహంబునకూఱట కలుగదు. ఏమిసేయుదు?

మేరి:— సోదరా! ఆగ్రహవశుఁడవుగానేల? ఇందుకనెమ్మదించి యాలోచింపుము. ఖలునకు నిలువెల్ల విషముగదా? కల్లకానిసొమ్ముకదా? కల్లవసిఁడికిఁ గాంతులు మెండుగావా? తనినుండి తప్పించిన కోపమునఁ దన్నుఁజంపవచ్చెనని యధికారులకుఁ దెలిపిన మనగతియేమి? అధికారులో రామదీనే వనఁ గొట్టంబునఁగట్టు మనువారు. మనమా విధిహతులము. ఇదియాలోచింపవలదా? అకటకటా! "ఇనుమునుఁగూర్చియగ్గికి సమ్మెటపెట్టు" యనురీతి నానుండికదా

నీకిన్ని కష్టంబులు? నేఁదనకులోఁబడనేని నినుఁజంపించెదనని యాక్రూరుఁడాడెను. అంతటికి నోపినవాఁడే యాకఠినుఁడు. ఖలులకు వివేకము గలుగునా?

ఆల్మేడ:—చెల్లెలా! అటులైనఁ బ్రపంచమేమునిఁగిపోవును "నిజమునీటిలో మునుఁగదు. నిప్పునఁగరగదు" అనునది వినవా? వానిమాటయ వేదవాక్యమా? వానినోసటనే ప్రొద్దుపుట్టెనా?

మేరి:— అన్నా! అనుభవరహితునివలె మాటలాడెదవుగదా? విచారణాధికారి పక్షపాతమూనెనేనిఁ బదివేలుగురు ప్రత్యక్షసాక్షులు ప్రమాణముచేసి యేకవాక్యతగఁ బలికినను వారియందఱి యందు నొక్కొక దోషమారోపించును. ఖలునిమాట బూటకము.

ఆల్మేడ:—(ఆలోచన నభినయించి) చెల్లెలా! నీవు నిజమాడితివి కర్తవ్యమిపుడెద్ది? ప్రాతఃకాల ప్రయాణము నాకుఁదప్పదు. నీవా యబలవు. ఒంటరిగ నిచటనిలుతువు. వాఁడా యక్కటికములేని కటిక. మదిరినమూఢుఁడు. అధికారులా వానిమాయావాగురకుఁజిక్కినవారు. అయ్యో! పరుల నొకహెచ్చుమాట పలుకరించి రోయుంగనిమనకెట్టిబాధ లొదవెను? హా! దైవమా! సజ్జనులకేనా యిట్టిసంకటములు?

శ్లో. మృగమీనసజ్జనానాం। తృణజలసంతోష విహితవృత్తీనాం॥
లుబ్ధకధీవరపిశునా। నిష్కారణమేవవైరిణో జగతి॥

టీకూ:— స్వామీ! మీరేలచింతించెదరు? మన నవాబుగారి వద్దకు మీరుపోయి యిచటజరిగిన వృత్తాంతమంతయును దెలుపుఁడి. వారుదీర్ఘాలోచనపరులు. కర్తవ్యంబు మీకుఁదెలుపుదురు. నేనిచట నేయుండెద.

మేరి:— అన్నా! మనయన్నయ్య వచన మవశ్యానుసరణీయుంబని నాకునుదోఁచెడు.

ఆల్మేడ:—నిజము. మీరు భద్రముగనుండుఁడి. మననవాబుగారి వద్దకు నేఁబోయివచ్చెద. ఆలస్యమునకుఁ గాలంబు లేదు.

(నిష్క్రమము.)

## తృతీయరంగము.

డిల్వారుఖాన్—గణేశపంతులు—దర్బారుసింగు—ఆల్మేడా.

(డిల్వారుఖాన్, గణేశపంతులతోఁ జతురంగమాడుచు)

డిల్వా:— (గణేశపంతులనుఁజూచి) గణేశపంతులు! ఇఁకనాల్గాటలలో మీరాజాకట్టఁబడునుగదా!

గణేశ:— నవాబుగారు! మాటలతోనగుపనికాదది. రాజానునంతటి యవలీలగాఁ గట్టుటకష్టము. మీకు మంత్రియేలేదు. లొటపిటగుఱ్ఱములా రాజాను నిర్బంధించునవి?

డిల్వారు:—అటులయినఁ గానిండు. లొటపిటమాట, ఎచ్చటికిఁబోదురు?

గణేశ:— మూలయింటికి వత్తునండి.

డిల్వారు:—ఇదిగో గుఱ్ఱపుమాట. ఇప్పుడేమిసేయుదురు?

గణేశ:— రాజాను ముందటింటికి జరుపుదును.

డిల్వారు:- నారాజా నొకయింటికి ముందటికి జరుపుదును. ఇప్పుడేమందురండి?

గణేశ:— ( ఆలోచన నభినయించి ) నిజమండీ! నిజము. రాజానిర్బంధింపఁబడెను.

( దర్వారుసింగు ప్రవేశము. )

ద॥ సింగు:- స్వామీ! పాదరీ ఆల్మేడాదొరగారువచ్చి ద్వారంబునఁ గాచియున్నారు.

డిల్వారు:- రానిమ్ము! ( దర్వారుసింగు నిష్క్రమించును ) ( గణేశపంతులుఁజూచి ) పంతులవారూ! తమకుఁ బ్రొద్దైనది. సెలవుతీసికొనుఁడు.

గణేశ!— అవునండీ! కాలము మీఱినది. పోయివచ్చెదను. ( నిష్క్రమించును )

( ఆల్మేడా ప్రవేశము. )

డిల్వారు:-- ఓ హలో హెలో పాదరిగారు! రండి. (అనుచరిరువురు పాణిపీఠనంబొనరించి) ఏమిదియచ్చెరువు? అకాలంబున వచ్చితిరి? మీముఖభావంబు వ్యసనసూచకంబు గానున్నది.

ఆల్మేడ:—నవాబుగారూ! ఖలసమీపవర్తులు సుఖదూరులనది మీరెఱుంగనదియా? పన్నగముండిన మందిరములోఁ బరుండిన నిద్రపట్టునా? మానమే ప్రాణమనువారి కీయవనియందునికి తగదుగదా?

క. మానంబీధర నెప్పుఁడు
ప్రాణంబుగఁ జూచువాఁడు పరిభవమొందున్
మానావమానములఁ దృణ
మానంబుగఁ గాంచువాఁడు మనును సుఖముగన్.

డిల్వారు:- ఏమండీ! మానహానికరంబయినపని యిపుడేమితటస్థించెను?

ఆల్మేడ:—చెప్పుటసిగ్గులచేటు. చెప్పకుంటప్రాణముచేటు.

డిల్వారు:- అయ్యో! ఏపాపమెఱుంగని మిముఁబోలు శుద్ధాత్మలకెవరేమిచేసిరి?

ఆల్మేడ.-- నవాబుగారు! నవీనముగానే తెంచిన డాక్టడియాగోయను పాదరికిని నాకును నంతరంగశుద్ధిలేనిది మీరెఱుంగుదురుగదా?

డిల్వారు-- నిజము. మాటలసందర్భమున మీ రప్పుడప్పుడు వారిచర్యను దెలుపుచుంటిరి.

ఆల్మేడ:-- అతఁడేమియేమియో నాపై దోషారోపణ మొనరించి యధికారులకు వ్రాసియుండవలెను. కానిచో నాకేల యున్నదినంబులు లేక యిప్పుడు నన్నుఁబనినుండితప్పించి విచారణకు గోవాకు రమ్మని వ్రాయుదురు? ఆ క్రూరాత్ముఁడు డాక్టడియాగో యధికారుల యాజ్ఞయని నన్నుఁ బనినుండితప్పించి తత్క్షణమే గోవాకుఁ బ్రయాణముగమ్మని గృహంబునకుఁబంపి నాసోదరి మేరి యొంటరిగానుండునపుడు మానభంగమొనర్ప కిరాతకన్యాయమున బలాత్కరించెనఁట. నాచెల్లెలు గుండెలుచెదిరి యఱచి పేలవ్రాల నందు నిద్రించినభటుఁడు లేచి యుపచరింపఁబోయెనఁట. వానింజూచివాఁడు పరుగిడెనఁట.

డిల్వారు:—( కోపముతో ) ఏమండీ! మానినీమానహానికి సమకట్టిన మానవుని ప్రాణంబులుదీయక యూరకుండునట్టి మీ జాతివారి యోర్పు హెచ్చండీ! కుక్క కాటుకుఁ జెప్పుదెబ్బ సరియన్నట్టు మాలో నిట్టికృత్యంబునకుఁ బ్రత్యక్షమయ్యే శిక్ష, పతితలవిషయమందు మీ జాతిరీతి బోత్రిగా నింద్యమని నిర్ధరించెద! ఔరా! ఎంతటినైగ్గర్ణ్యంబిది? ఎంతటిదౌష్ట్యము! ఎక్కడకుఁ బోయిన మానము దొక్కమిచ్చినను వచ్చునా? సజ్జనసంతాపకృత్యము కులక్షయమని యా కులనాశకుఁడు దెలియఁడాయెఁగా?

ఆశ్నేదా:—ఏమి సేయుదునండి? ప్రాణంబులొసఁగి వానిప్రాణంబులఁదీయ సమకట్టియెంత వెదకినను వాఁడు దొరకఁడయ్యె. నేను రేపు ప్రాతఃకాలంబున గోవాకుఁ బ్రయాణంబు గావలెను. అచటి విచారణాధ్యక్షులు వీనిబంధువులు. వారచట నన్నేమి సేయుదురో? ఇచట యీ కలుషాత్ముఁడు నా చెల్లెల నేబాధపెట్టునో? నాగతి సందంశసీ న్యాయమును సరించినది. అది కొఱ్ఱునఁజిక్కిన పక్కబలె నామనము చిక్కినది. కర్తవ్యాంశం బెద్దియు నాకుఁ దోఁపక యున్నది.

డిల్వారు:—( దీర్ఘాలోచన నభినయించి ) ఇప్పటిస్థితిలో మీరు గోవాకుఁ బోవుట కర్తవ్యము కాదు. ఈ యబల యొంటరిగా నిచటనుంట యపాయంబు. ఈ రెంటిని సమపఱచు నుపాయం బొకటి నాకుఁ దోఁచినది.

ఆశ్నేద:— అదియేమి?

డిల్వారు:—పాదరిగారూ! స్వజాతివైరంబు సమకూరి యహమ్మదునగరు, బీజాపూరు వారికిఁ గొన్ని దినంబులుగా యుద్ధములు జరుగుచున్న విషయంబుఁ దమకు వేద్యముగదా?

ఆశ్నేదా:—నిజము. వినియుంటిని.

డిల్వారు:—ఆ యుద్ధమునకు బీజాపూరుసేన రెండుశాఖలుగా నేర్పడి యుద్ధరంగంబునందుండ "యిన్మాలుముల్క" రాజద్రోహియై రాజునుఁజంప నుద్యమించెనఁట. దానింగనిపెట్టి యా విశ్వాసఘాతకునిఁ గారాగృహంబున నుంచినారు. మఱియొక శాఖలో సమ్మోహకలహంబులు సంభవించి రాజద్రోహియగు "ఇల్లాజుఖాన్" చంపఁబడెనఁట.

ఆశ్నేద:— అకటా! ఇట్టి సమ్మోహకలహంబులుగదా పరరాజులకు జయసూచకోత్సాహంబులు?

డిల్వారు:—నిజము. దైవానుగ్రహమునఁ బ్రస్తుతము యుద్ధప్రసక్తి నిలిచినది.

ఆశ్నేద:— కారణంబేమి?

డిల్వారు:—ఈ యుద్ధమునకుఁ గారణభూతుఁడయిన యిస్మాల్ గారాకస్మికముగ మృతినొందిరఁట. వారితండ్రి మరల సేన సిద్ధపఱచికొని దండయాత్ర వెడలుటకుఁ గొన్నిదినంబులు పట్టును. ద మనవారేమో సకల సన్నాహసంసిద్ధులై దక్షిణదిగ్భాగంబునఁ గాచియున్నవారు.

ఆశ్నేద:— అదికదా బుద్ధికుశలత.

డిల్వారు:—ఈ యుద్ధంబున కహమ్మదునగరేశుండు మీ జాతివారి సాహాయ్యంబుపేక్షించినాఁడఁట. ముదగల్లులోనుండు పాదరి వారికిం దోడ్పడి కార్యములు నెరవేర్చుచున్నాఁడని మనసుల్తానా చాందుబీగారికి సమాచారంబు దెలిసి వారీదినంబుననే నాకు వ్రాసినారు.

ఆక్మేద:— ( ఆచ్చపడి ) ఏమి ఏమి! పోర్చుగీసు పాదరి యిహామన్నాగరు వారికి లోంబనా?

డిల్వారు:—మీరు నిర్దోషులు. ఆ డాకెడియాగో కృత్యంబిది. వానిచర్యలు చూచుచే యున్నాను. ప్రకృతము మీ రక్షణార్థము మిము రాజద్రోహులుగానెంచి బలదుర్గమున నుంచెద. గోవాయధికారుల బాధనుండి మిరిపుడు తప్పించికొనియెదరు. ఈ క్రూరుని నడవడికి సేనిచటం జక్కగం బరిశీలించి మహాధ్యక్షులకుం దెలుపుచుండెదను. ముందెటు లయిన నటు కానింపు « నందోరాజాభవిష్యతి ”

ఆక్మేద:— ( దీర్ఘాలోచన నభినయించి ) నవాబుగారు! కలుషాత్మకులుంచు కాటియలు పడుటకంటెను శుద్ధచేతస్కులుంచు నిర్బంధము సుఖముగా ననుభవించెదము. మమురక్షించు భారంబు మీయది. కాయకొడవలి మీ వశపఱచెద. సమయమునకై నవారే మిత్రులు, సాహసము చూపినవారే భటులు.

డిల్వారు:—మిము నచట రక్షించుటకై నా బాల్యస్నేహితులగు దర్వేషుగారికిని నచటి యధికారికిని లిఖించెద. ఆ దర్వేషుగారు సకలవిద్యా విచక్షణులు. మాంత్రికులు. వైద్యశాస్త్ర ప్రవీణులు. స్నేహపాత్రులు. మీరీరాత్రియే ప్రయాణముగండు. ( అనుచు « దర్బారుసింగ్ ” అనిపిలుచును. )

దర్బా:— స్వామీ! వచ్చితిని.

డిల్వారు:—ఈ పాదరిగారిని వీరిసోదరిని బలదుర్గమునకుం బిలుచుకొనిపోయి దర్వేషుగారి యింటిలో నుంచుము. ఇపుడే వెడలుము. (పాదరి గాంచి) పాదరిగారూ! మీ సోదరీసహితులై వెళ్ళుడు. ప్రొద్దైనది.

(నిష్క్రమింతురు.)



# చాందుబీచరిత్రము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

జలదుర్గము - అబిస్సు - దర్వీషు - ఆల్మేడా - ఆస్మాన్‌బేగు - రంగానాయక మేరి - జోరియా.

అబిస్సు:— జోరియా! ప్రయాణంబయ్యెదననినఁ గన్నీరుఁగార్చెదవేల? నే నిను మఱతునను సందియమా?

ఆ. వె. వలదు వనరుహాక్షి! వలవంత నీకింత
కార్యభారమున్న కారణమున
నరుగువాఁడఁగాని యకట! నామనమ్మెల్ల
నిచట నిలిపినాఁడ నిజముగాను.

సుగుణకలాకలాపా! ఈ మాట నిజమని యిదిగో నీ కేలం బెద [ అనుచు జోరియాకేలంటుచు ] నాతీ! ఈరీతి నుద్విగ్నచిత్తవై వ్యాకులతఁ జెందుట నీయందు నా యనురాగంబు సందియించుటగదా?

జోరియ:—ప్రియతమా! ప్రయాణంబున కంతరాయంబుఁ బ్రతిఘటించి పలుక నే నేమిపిచ్చిదాననా? సఖా! దేహారోగ్యంబుఁగనుట దేహికిఁ బ్రథమధర్మంబుగాదా? నిన్న నే జ్వరమించుక తగ్గెను. గాయమింకను బసిమియాఱదు. ఈ చలువగాలి దృఢాంగులను సైతము బలహీనులనుజేయును. అక్కారణంబునఁగదా ప్రయాణంబిపుడే వలదని మనపాలి దైవంబువలె వచ్చిన పాదరీదొర పలికెను? స్వస్థతదేహధారికి సంపదగదా?

అబిస్సు:— భామా! నీ యుపచార మహిమంబెట్టిదియో గాని నే మున్నుకన్న నిప్పు డత్యధికారోగ్యస్థితి నున్నవాఁడను. భవదనురాగాతిరేకంబు నాయందపరిమితంబు గావున నీవీరీతి సందియించెదవు.

మ. అనురాగాతిశయంబునుండు విషయం బందున్ మనోవృత్తి గో
పనతన్ దానిపురోభివృద్ధిని మదిన్ భావించి యెల్లప్పుడే
యణుమాత్రాధియు సంభవింప నదియే యత్యాయతిన్ జేసి తా
వనరున్ లోకములోన నైజమిది యో భామామణీ! కానవే?

జోరియ:—ప్రియసఖా! చిన్నతనంబునుండి యాకలముదిని కోవలనీరుఁద్రావి కానల నివసించుచు వన్యంబులబలె మనిన ననుబోలుమానిని నీనాగరిక ధీరచతురోపచారోక్తులకుం బదులిడ నేర్చునే? ప్రియతమా! వ్రణపీడితుఁడవై స్మారకముదప్పి నీవిచ్చటికి వచ్చినపుడు నిను జూచి అయ్యో! ఈ కుసుమసుకుమారకాయుండెన్నఁడు తిన్నఁగ లేచి తనవచనసుధాసేవనచే నాచెవులఁ దడుపునోయని వేచితి. దైవానుకూలంబున శీఘ్రకాలంబున నదితటస్థించె. నాటంగోలె

తావక సర్వలక్షణాన్విత సుందరవిగ్రహంబను బీజంబు నా హృదయక్షేత్రంబునందుంచి యనురాగ రసముచేఁ బెంచుచుంటిని. ఇట్టితఱిఁ బ్రయాణంబని నిన్న నీవాడిన పలుకులు ములుకులమాడ్కి వీనులఁ గ్రుచ్చెను. రాత్రియంతయును భవద్వియోగాగ్నిజ్వాలలం దపుడే పడ్డటు సంతపించితి. ఎట్టకేలకు ధైర్యంబవలంబించి ప్రయాణంబిపుడు వలదని వేఁడికొందమని వచ్చితి! సఖా! నిజము బలికితి. క్షమింపుము.

చ. పయనమనన్ వియోగమను పావకయోగమెగాక యన్యమే
మయినను నున్నదే? నిజము నాడితి వేఁడితి నీక్షమాపణన్
బ్రియములుపల్కి పోవుటది ప్రేమయనందగునే? యరిందమా!
దయఁగలదేని నీవు నను దవ్వులఁద్రోసి చనంగ న్యాయమే?

ఆలిస్సు:—అలికచా! భవదపాంగాశుగంబులచే గెలిచి యనురాగపాశముచే ననుం బంధించితివి నేను నీశరణుఁ జొచ్చినవాఁడను. నీయనుమతిలేక ముందొకయడుగిడఁ జాలుదునే! నేనిపుడు బీజాపురికి వెళ్ళి నాతల్లిసమానురాలుగానున్న సుల్తానాచాందుబీరాణిగారికి రణోర్వీఁగలిగింప రాజద్రోహవార్తలు దెలుప నేని వైరులు సమయముగాచి నాపైఁ గొండెములుపల్కి రయే కీడొనరింతురో? గొల్లరయేమటినఁ దోడేళ్ళకుత్సవముగదా?

వం. వినుసఖి! జోరియా! పురికివెళ్ళక నిల్చితినేని వైరులా
జననికి, చాందుబీకి, మది సందియ మొందెడురీతిఁ గొండెముల్
వినిచి మఱే కలంతలను బెంతురొ? కీడొనరింతురో గదా?
మనిగను మేలటంచ నెడిమాట యథార్థముగాదె? మానినీ!

సఖీమణీ! రాచకార్యంబుఁడినఁగదా నీయెంతచాటయినను సహించి శరీరాయాసంబును సరకు గొనక ప్రయాణము నిర్ధరించితిని?

జోరియ:-ప్రియసఖా! అటులయినచో నీ ప్రయాణంబు సకారణంబుగనున్నది. నాథా! దుస్సహమయిన యీవియోగంబెటులయిన సహించియుండెద. దీనురాలిపైఁ బ్రేమమఱవకు. ( అనుచుఁ గన్నీరునించుచు. )

చ. అబలను నీదుప్రేమకును నాస్పదురాలను దీనురాల నీ
నిబిడవియోగమే గతిని నీకుదునంచని కుందుబాల నో
ప్రబల! పురంబుఁ జేరఁగనె భావమునన్నను దవ్వుచేయకే.
యబుసునన్నైన నీశుభము లూఱటకైనను నాకువ్రాయుమా.

ఆలిస్సు:—జోరియా! నీవు బాష్పపూరిత నయననవగుట నేఁజూచి యోర్వఁజాలను. ఊఱడిల్లుము. పురిఁజేరి యచట రాజకార్యములన్నియును దీర్చి నిన్నుఁ బిలిపించెద. నిజమిది నమ్ముము.

( తర్వీషు, పాదరి, రంగనాయకుల ప్రవేశము. )

(ఆలిస్సుఖాన్ బాలింజాది లేవంబోవ నందఱు వలదని నివారింతురు)

దర్వేషు:—బాలకా! ఆ గాయమునొప్పి యిప్పుడెటులున్నది? రాత్రిసుఖముగా నిదురపట్టెనా?

అబిస్సు:—మహాత్మా! నీయనుగ్రహంబున నాకింక గాయమే యున్నట్టగపడదు. ఈపాదరిగారి యౌవన సామర్థ్యంబెంతయో కొండదనంబులకే నాశ్రయమయియున్నది. నాప్రయాణం బునకిక చేయుటంకము లేదు. తమ యనుమతి గైకొనవలసి యున్నది.

దర్వేషు:—అబిస్సు! అటులయిన నీవు క్షేమముగఁ బోయిరమ్ము. భగవంతుని మేము మఱవము. నీసంరక్షిత గాయిత సురక్షితముగ నుంచికొమ్ము.

(అస్మర్ బేగు ప్రవేశము)

అబిస్‌ఖాన్, అస్మర్‌బేగులు, అన్యోన్యాలింగన వందనంబు లాచరింతురు.

అస్మర్:—[అబిస్సుఖానునుఁజూచి] మిత్రమా! నీకు ఖండంబుఁజూడ రోగనివారణమయినట్లు తోఁచుచున్నయది, గాయము నుగుణమయినదిగదా?

అబిస్సు:—సఖా! ఈమహానుభావుల యౌషధమహిమచే బ్రతికితిని.

అస్మర్:—సంతోషము సంతోషము, (దర్వేషు గారింజూచి) దర్వేషు గారు! ఈచిన్నది యెవరు?

దర్వేషు:—అయ్యా! ఇది నామనుమరాలు

అస్మర్:—నేనెన్నఁడుఁ జూచియుండలేదే?

దర్వేషు:—అయ్యా! మీరు కొండపైనుండువారు గావున మీరెన్నఁడుఁ జూచియుండరు.

అస్మర్:—ఈచిన్నది వివాహితయా? అవివాహితయా?

దర్వేషు:—అయ్యా! అవివాహిత.

అస్మర్:—( తలయూఁచి ) ( అబిస్‌ఖానునుఁజూచి ) మిత్రమా! నీవిచటనుండి వెళ్లునపుడీపాదరిని నీతనిసోదరిని నీవెంట బీజాపూరుకుఁ బిలిచికొనిపోవునటుల ముదగల్లు నవాబుగారు వ్రాసినారు. నీవటులొనరించెదవుగదా?

అబిస్సు:— హా! అది నాకు సంతోషకరమయినపని. దారిని నీపాదరిగారి సాహాయ్యముగావలయును.

అస్మర్:—[ చిఱునగవునగుచు ] వారిసోదరితోడ్పాటు సైతము వలయునేని నీకులభించును.

ఆత్మేడు:—[ కోపముతో ] ఏమండీ నవాబుగారూ! ఇటునర్మగర్భితముగా మాటలాడుట మీకుఁ బెద్దరికమా? యత్నములేక చిక్కినమాత్రాన చులకనగాఁ జూచుటతగునా ?

అస్మర్:—[ కినుకతో ] ఏమోయి నాస్తికాధమా! నీకేమితలపొగరా ? నామాటయందుఁ జెడుగేమియున్నది? దారియందేదయిన సాహాయ్యమువలయునన్న నీసోదరిచేయదా? మీలోని వాడువారు పరపురుషులనంటుట దోషమా?

అబిస్సు:— [అస్మర్‌బేగునుఁజూచి] మిత్రమా! ఇంచుక నెమ్మదించి మాటలాడుము. ఈపాదరి తెలివికల శస్త్రవైద్యుఁడు. నాస్తికదోషారోపణము జాతివైషమ్యకారణంబునఁ బరస్పరదూషణ సాధకముగా నేర్పడినది. ఆజాతివారికి మనమే నాస్తికులము. [ పాదరిగారినింజూచి కనుసన్నఁజేసి ] పాదరిగారూ! మీరుద్దరలోఁ బ్రయాణసిద్ధులుగండు వెళ్లుఁడు ( పాదరి నిష్క్రమించును ) ( అస్మర్‌బేగునుజూచి ) మిత్రమా!

మ. సరికాదీమతభేదచర్చలు మసీహా! కల్పనాజాతముల్
తరమే మేరికిఁగాని దీనజనులన్ ధన్యాత్ములన్ జేసిఁ గా
వరపుం బల్కులు పల్కు? దుఃఖమది, నీవా గొప్పయుద్యోగివై
వరమంత్రోద్భవుఁడయ్యు దీనపతి నుద్ధృత్ పల్కు గాన్యాయమే!

అస్మర్:— సఖా! నేనుబోయివచ్చెదను. అచ్చట మనవారికెల్లరకు నావందనంబు లర్పింపుము. సెలవిమ్ము పోయివచ్చెద, (దర్వీషునుఁజూచి) దర్వీషుగారూ వందనంబులు, పోయివచ్చెద. సెలవిత్తురా?

దర్వీషు:— మంచిదండీ మీకు క్షేమంబు మేలొసంగుఁగాక.

( అస్మర్ బేగు మరల జోరియానుఁజూచి తలయూఁచి నిష్క్రమించును )

అబిస్సు:— ( జోరియానుఁజూచి ) జోరియా! తాతగారిని గృహంబులోనికి పిలిచికొనిపోయి స్నానంబు సేయింపుము. నేనిపుడే వచ్చెద (జోరియా ముసలిదయిన దర్వీషుగారిని పిలిచికొని నిష్క్రమించును) ( రంగనాయకునిఁ జూచి ) రంగనాయకా! ఈయస్మర్ బేగు దుష్టచర్యను జూచితివియా! వీనికింటికి సధికారంబు గల్గినది. వీనికి సధికారమిచ్చినది పిచ్చివానిచేతికి పిచ్చుకత్తి యిచ్చినట్లైనది.

రంగా నా॥:— నేఁడా? మొదటినుండి యెఱింగినదేను. అతఁడు రాగాంధుఁడు.

అబిస్సు:— రంగనాయకా! వైరిచేతఁజిక్కి స్రుక్కిపోలినప్పుడు నాప్రాణంబుఁగాపాడిన పరమమిత్రుఁడవు నీవు. నీకుం దెలుపని రహస్యంబెద్ది? నేనీదర్వీషుగారి గృహంబుఁజొచ్చిననాఁటి నుండి తారుణ్యలావణ్యఖనియైన జోరియా నాకుం జేయు నుపచారంబపరిమితంబు. ఈ కోమలాంగి లజ్జావనతవదనయై కటాక్షవీక్షణంబులచే నాయందనురాగంబు వెల్లడించుచుండెను. మాయిరువురిమానసంబులు పరస్పరానురాగబంధంబులయ్యెను. ఇప్పుడే నావెంటఁబిలిచికొనిపోయి పరిణయంబగుటకు సమయంబుగాదు. అస్మర్ బేగుయొక్క దుష్టచేష్టావికారంబులు దుస్సహంబులైనను సైఁచితి. నేను లేనితఱి నాజడాత్ముండీ జడజనయన నేయిడుములంగుడుపునోయని జడిసెద. ఏమి సేయుదు? ప్రయాణప్రయాసంబునకు నే భయపడను. ఇదియొక్కటియే నాకు హృదయశల్యమయ్యెను.

రంగానా:— అబిస్సుఖాన్! నీవటుఁడిచటఁ బ్రాణంబుననుండుపఱకు నేభయంబును నీకువలదు. కార్యాంతరంబున నేఁబోయినను నాచేతిక్రిందనుండు బోయవారినిఁ గొందఱిని నిచటఁ గావలి యుంచెద. నీవు సురక్షితముగాఁ బురిఁజేరుము. కొన్నిదినంబులలోనే నేను బీజాపూరుకు వచ్చెద.

అబిస్సు:— ఈ బాలామణినిఁ గాపాడు భారంబు నీయది. నిను నమ్మి ప్రయాణమయ్యెద.

రంగానా:— మంచిది. అటు నమ్మియుండుము.

(నిష్క్రమణము.)

## ద్వితీయ రంగము

### జలదుర్గము కోట

అస్మత్ బేగు - లతీఫా - జోహరారు - అబ్దుల్లా - రహీమాన్.

అస్మత్ బే:—(నిట్టూర్పు విడుచుచు లతీఫానుఁ జూచి కినుకతో) హా! హా! లతీఫా! చాండాలీ! కులటను గలనైన నమ్మకుమనునది స్థిరపఱచితివి. కలకాలంబు నినుఁ బోలు వెలయాలికలయికల నేఁగాలంబుఁ గడపవలెనను తలంపుతో నను మోసగించితివి. నాకుందగిన కుందరదనయిం దెందుఁ లేదని మందలించితివి. ఇన్నగరున నే యొకయన్నులమిన్నను నేఁ గన్నారఁ గంటిని. ఆతరుణీమణి స్త్రీసౌందర్యంబునకుఁ బరమావధియై వసుంధర సంచరించు దేవతావనితంబోలెఁ గ్రాలుచున్నయది. ఆచికిలికడాసిబొమ్మను నేఁ గాంచిన తఱినుండి యనంగ రాగరసవారిధి మునింగి నిర్గమింపఁ జాలనైతి. ఔరా! సౌందర్యమా!

సీ. పులు గడిగినమించు పుత్తడిబొమ్మయో?
  కందర్పునూతన క్రమశరము?
తొగలరాయని చాయ నగియెడిజిగినిగ్గొ?
  జగదభినవభాగ్య జలజభవయొ?
తుంపెసలారెడి తొలికారు జిగిమించొ?
  సౌరభాపూర సంచారలతయొ?
కలికిమాటల నేర్పుఁగల విరిబంతియో?
  మదనమోహానపర మంత్రఫలమొ?

గీ. అనఁగవెలయుకల్కి యంగజుప్రాముల్కి
యిందువదన సమ్యకుందరదన
కమలనయన గంధగజయాన త్రిజగానఁ
గాననెందు వింతచానవినవె.

ఆ వాలుగంటిఁ గాఁడివాలారుచూపులను తూపులు నాశరీరమెల్లఁ గ్రుచ్చి కాఱింపుచున్నయవి.

మ. తరుణీ! తెల్పఁగఁ జాల నాయలివ సౌందర్యాతిరేకంబు నా
కరియానన్గని కామబాధితుఁడనై కానంగలే నేదియుఁ
భరమా? మారునిపట్టుబొమ్మయగు నా భామామణిన్గాడ కీ
బరువైతోఁచు శరీరమోపఁగ? లతీఫా! మాటలింకేటికిన్?

లతీఫ:— ఏమండీ! నిజమాడిన నిష్ఠురము నాకువచ్చినసురానిందు. కంతుసంతాప సంతప్తులై మీరే యింతినిఁ జూచినను సొగసులదొంతీ! పువ్వులబంతీ! మదనునిమదదంతీ! యని యంతములేని వర్ణనతోఁ బిచ్చిపిచ్చిగ వర్ణించుచుందురు. కాముకులకు వివేకముగలదా! ఆకామినిని మీరు

గాంచినపుడు మీరతియాత్రగనుంటిరో? మధుపానాతిశయతచే మత్తిలియుంటిరో? ఈ గ్రామమున నాకుఁగానరాని కామిని మీకెటుకానవచ్చెను? మీకు మూడవ నేత్రమున్నది కాఁబోలు.

అస్మక్:— లతీఫా! హెచ్చుమాటలాడకు. దేశఁగానివారికిఁ గాఁగలనెందుకుగాదా! [illegible] నిజముగ నొక యువతీయమునగని మచ్చికంటినిఁగని తుంటవిల్తునికంటకింబుగ నొచ్చితిని. అది ర్వ్యకవేణి దర్వేషుగారి మనమరాలు.

లతీఫ:— (పక్కునవ్వి) అవా! అహా! తెలిసెను. తెలిసెను. పనితెల్లవాఱెను. దక్కనిసంబంధము కుదిర్చికొంటిరి. అనంగ భూతావేశులకు నుచితానుచితజ్ఞానంబుండునా? మిమ్ముఁ బోలు లక్షాధికారులట్టి బిచ్చాలమారి మనమరాలినా కోరునది? రత్నాలుతినుపక్షి యెంగిలి కాశించినట్లాయెను. కుసుమగంధుల పైపనలుగని కులమువానిఁ బోకార్తురా? ఇట్టిసంబంధము తిరముగ నతకునా? నీటికినగ్గికి నెయ్యముగలుగునా? నూనెయునీరునుగలయునా? మీరేల యావిచారంబుఁ జేయరైతిరి? మీపెద్దలు దీనిన్వినిన మీకు బుద్ధిచెప్పరో?

అస్మక్ బే:—లతీఫా! నీకుఁ బొగరు తలకెక్కి మితిమీఱి మాటలాడెదవు. నీహితబోధన తెవరడిగిరి? మనముఁగలసినచోట మతముగలయును మమతగలయును. ఇదియే నామతము. ఆస్త్రీనగనోన్నదానిని నామనోరమను నిచటికింబట్టి తెప్పించెద. ఆమధురాధరమునంబున నాయందనురాగంబు గలుగునటులొనరించిన విధివిధానోద్వాహంబుననే దానింగూడెద. మున్నుభంగి నీవును భోగినిగానుండనగు. ఈయానతిమీఱి నటించితివేని నీకిదివఱకు నిచ్చినధనంబెల్ల వెళ్లగ్రక్కించి యీకొండక్రింద నిండిప్రవహించు నీటికి నీకండ లాహుతులుగనిచ్చెద. ఇదివృథాలాపముగాదు. ఈ నా తరవారమాన. (అనుచుఁ గత్తిగొ చేతఁబూనును)

లతీఫా:— (గడగడవడఁకుచు) స్వామీ! ఇదట నేనుండునది మీయభీష్టంబు నెరవేర్చుటకుంగాదా! మీయిష్టంబురీతి నటించెద.

అస్మక్ బే:—అటుచేయుము బొమ్ము. ఇదిగదా బుద్ధికుశలిన మాట! (లతీఫా వందనరుబలొనరించి "ఈపాపిరూపమాపు వారెవరును లేరు. ఔఁగాదని వంకలొత్తి చెప్పవారును లేరు. ఏటివంకరయెవరుదీర్తురు? వీనిచేఁజిక్కి క్రుక్కుచున్నాను. తప్పించికొనుటకు దిక్కులేదు" అని పలవరించుచు నిష్క్రమించును.)

జోహారూ! (అనియఱచును.)

జోహార్:— ఉన్నాను. వచ్చితిని (అనుచుఁ బ్రవేశము.)

అస్మక్ బే:—జోహారు! నిన్నటిదినంబున నామాట జవదాటిన "తాటా" యను వానిగతి యేమాయెనది యెఱుంగుదువుకదా?

జోహారు:—ఎఱుగుదును! మహాప్రభూ! కొండమీదినుండి క్రిందికిఁద్రోయఁబడెను.

అస్మక్ బే:—అవిధేయతగదా వానికట్టి వధఁదెచ్చినది? సేవకులు స్వామియాజ్ఞ మీరరాదు.

జోహరుః:-నిజము మహాప్రభూ! నిజము.

అస్లుక్ బేః:--జోహరు! నీకిపు డొక రహస్యకార్యంబుఁ జెప్పెద. బుద్ధిశాలివై హెచ్చరికగలిగి యాపని నెరవేర్పుము, ఏమఁతితివేని నీశరీరము నీదికాదని నమ్ముము.

జోహరుః:-స్వామి కార్యమొనరించుటయం దొడలన్నియుఁ గన్నులుగలిగి ప్రవర్తించెద.

అస్లుక్ బేః:--సరి సరి. జోహరు! ఈదినమున ... తెలిసినదా! ఇదేదినమున సాయంత్రి సమయమునఁ గొండక్రింది భాగమున నెచటనయిన నీవు డాఁగియుండవలసినది.

జోహరుః:-చిత్తము వెళ్లెదను. (అనుచు నిష్క్రమింపఁజూచును.)

అస్లుక్ బేః:--(కోపమునలేచి) ఒరే! జ్ఞానశూన్యుఁడా! పనియేమయినది వినక నీవచటేమి సేసెదవు?

జోహరుః:-నిజము నిజము. నేనచట డాఁగి యేమిసేయవలెను?

అస్లుక్ బేః:--అచట దర్వీషు ఘనమరాలు జోరియాయను చిన్నదియాకలములపై వచ్చును. అట్టితఱి నీవాచిన్నదానిం బట్టి నావద్దకుం దెమ్ము. తెలిసినదిగదా నీవీదినంబునఁ జేయఁదగినపని?

జోహరుః:-(హా హా! యని వ్యసనమభినయించును) మహాప్రభూ! ఆచిన్నది మీకే నేరంబొనరించెను?

అస్లుక్ బేః:--(కోపముతోఁ గత్తిచేఁబూని) ఓరీ! మూర్ఖుఁడా! నీకీతలగొట్లమారితనమేల? మాఱుపలుకక నాయానతిసేసెదవా? కాదేని నీకుతక యీతరవారంబునకు బలియిత్తువా?

జోహరుః:-(వడఁకుచు) మహాప్రభూ! మీయానతియొనరింతును. ఇపుడే పోయెదను.

అస్లుక్:— అటుచేయుము. వలయునేని నీకుసాహాయ్యముగా "బేహారును" బిలిదికొనిపొమ్ము వెళ్లుము.

జోహ:—చిత్తము (అనివెళ్లుచు) (స్వగతము) ఈక్రూరుని బారిఁబడి తప్పుట బెబ్బులివాతంబడి జీవితుఁడుగా వెడలుటయగదా? (నిష్క్రమించును.)

అస్లుక్:— (స్వగతము) హా! పంచశర నిశితశరోత్పీడితస్వాంతమా! నీదురంత చింతాభరంబంతయు నేటికిఁ బంతంబయ్యె. అలోకోత్తర లోచనానందకర రూపలావణ్యవిత్తయగు మత్తకాశిని చిత్తజ సుఖంబుల నిన్నింతలోఁదేల్పు ... ఏమీ! హృదయమా! చెదరి బెదరెదవేల? అమ్మంద యాన కందర్పకేళిలో నినుఁ బొందదని సందియమా! వలదు. వలదు. ఈ పోయినభటుఁడాపూఁబోడినిఁ దోడితేఁడనియెదవా? వాఁడు తేకున్న నేమి? ఆయుద్యమారంభమునకు వానితల బలిగానిచ్చి నేనే యా ననలకెన యగు మెత్తనిమేనిచానను దెచ్చి నీసంపూర్ణానుభవంబునకిచ్చెద. నాయాన. నాతరవారమాన నమ్ముము. ఆతరుణిని నితరస్త్రీలంబలె తాత్కాలికోపయోగభోగినినింజేయక విధివిధానంబుగఁ బరిణయంబయ్యెద. మంచిది ఇపుడిచట నేనేమిసేయఁదగినది యున్నది? ఆరాకేందుముఖిరాకకు నెదురుచూచుచుఁ బ్రాకారముఖద్వారంబునఁ గాచియుండెద పోయెద.

(నిష్క్రమించును.)

## తృతీయ రంగము.

## జోరియా ప్రవేశము

(స్వగతము) హా! హా! దైవమాయ మరూహ్యంబు. నిష్ఫలపుష్పఫలంబగు నీపర్వత ప్రదేశ పాదపాళికి నవపల్లవకుసుమఫలోత్సాహంబుఁ బ్రాప్తించె. సుఖదుఃఖంబులు శకటగత చక్రంబుంబలెఁ దిరుగుచుండునను ప్రశిద్ధోక్తి, కలిమిలేములు కావడికుండలను ప్రవాదంబీయుతు మహిమంబెల్లరకుం దెల్లంబుఁ జేయుచున్నయది:— హా! హా! మలయానిలాందోళితతరుశాఖల నర్తనలు గనులకు విందొనర్చుచున్నయవి.

క. మలయగిరి మలయజంబుల
కలరుటక భాగ్యతనుగన్న గంధవహుండు
తలమందలి కొమ్మలకును
కులుకుల నర్తనలు గఱపు గురువుగనయ్యెన్.

కాననంబన నిటులుండవలదా! ఏకొమ్మఁజూచినను పల్లవశోభితంబు, కుసుమలతావృతంబు సురుచిరరసాన్విత ఫలాభిరామంబు. శుకపిక శారికా నికరమాధురీనాదంబు.

కం. ఈ చిగురుటాకు లగుఁగట
నా చిలుకో యిలవిందు నంజూఁడగుఁగదా
నం చిలుకల కీఘలములు
నీచిలుమంగోల హానిసిగ్గుకొని యుదక్.

[అనుచు నాకులుపండ్లు గోయుటనభినయించి.]

ఇఁకఁజాలుఁజాలు. ఇవియే యీదినంబున నాపిల్లలకు సందుపందుపయోగును. ఇంచుక విశ్రమించి యింటికిఁబోయెదను (అనుచుఁగూర్చుని) ఏమీ! యీస్థానమహిమయో కాక నా మానసచాంచల్యమో తేనిపోనియాలోచన లేమేమియో పొడుచున్నయది! ఈపలువన్నెల చిలుకలు మేరమీఱి పలుకుకు మారుపలికి నన్ను వెక్కిరించుచున్నయవి. ఈశారికానికరంబు సరసంజేరి నమంగేరి పొదుపుమాటలచే నను ధిక్కరించుచున్నయవి. ఈగండుఁగోయిలలు కండక్రొవ్వి కనులెఱ్ఱజేసికొని రొల్లిదంబుగ నీలలువేయుచున్నయవి. ఈ మలయానిలుండు చెలరేగి యబలనగునన్ను నంటిచలింపఁజేయుచున్నాఁడు. ఇట్టిరీతిని నామానసాపహారుండు స్మితవికసితలోచనుండు నిర్మలగుణగణోదారుండు నాసరసమండిన విట్టిగంధవహుల గర్వంబు సర్వంబు నిర్మూలంబగు చుండెనుగదా! అపుడెంతటి ముదమ్మిని నేననుభవించుచుంటినో గదా! ఇపుడేలయీమాటలు? ఆపురుషవరేణ్యుని పునర్దర్శనానుభవంబు నాకెప్పుడు గలుగునో? ఆరసికుని భావగర్భితానురాగకటాక్షంబు నామానసంబుఁజొచ్చి యపహరమా పురుషతల్లజుని చరణసరసిజంబుల సరసకు నీడ్చుచున్నయది. నామానసంబున్నటుపోవుటకు సిద్ధపడినది:...ననుఁబొందిన మానలజ్జాభయంబులది బుద్ధికాదని. వెనుకకు

లాగుచున్నయవి. ఇట్టిదశాపళతఁ గృశించు నవ్వారుదన మోహనుండెప్పుడు సదయుఁడై రంప్పించునో? హా హా! ఏలయీయాయాశలు? సంపన్నులు చపలచిత్తులు. మఱచువారిసొమ్ము. అవన్నె కాఁమినన్ను మఱచియుండునా? మఱవఁడు. ఒకవేళ మఱచినచో నేనేమిసేయఁ గలను? వియోగవ్యథచే నేఁబడుపాటంతయు నుతువుచు నొక జాబువ్రాయుదునా? (ఆలోచననభినయించి) వలదు వలదు. అదిచులకనయగును. అతఁడువనువదలి యైదూదినంబులే గదా యయ్యెను? (అనుచు వేళ్ళెంచును) అపుడేయచటఁ గార్యభారంబంతయుఁ దీఱి యుండునా? ఉండదు. ఇంచుకనెమ్మదించిగాచియుండెద.--ఇట్టితలములందు నేనొంటరిగా నుంట దోషంబు.

కం. ఎలమావిచివురులనుఁగొని
కలకంఠములామ్రుదేగి కలకంఠములన్
జెలరేగి యీలలేయుచు
జెలులమనోధైర్యములను జెఱచునునిటన్.

ఇట్టి దుష్టారివర్గంబుఁ దొలఁగి దూరముంటయ మేలు. వెళ్లెదను.

(జోహరూరు, దేహారుల ప్రవేశము.)

జోహ:—(దేహారుంగని) దేహారు! చిన్నతనమునుండి మన్ననల లాలించిన శాలనుబట్టుటెటుల? పట్టివశుప్రాయుఁడయిన యూపిళునాథుని వశపఱచుటెటుల? ఎన్నిమారులా చిన్నది యిచ్చటనే మనలంజేరి యాకలములు గోయించుకొని మీయుపకారంబుపరిమితంబని పలుకలేదు? పట్టీ! ఒకచిన్నపాటషాడుమనిమనము వేఁడనాచిన్న చెన్నితూరులుతవ గానసై పుణ్యంబుఁ జూపి మనకు ముదంబుఁ జూపి మనకు ముదంబు గూర్పదు? ఇట్టిముద్దుపట్టిని నా క్రూరునకుఁబట్టి యిచ్చుటెటుల?

దేహారు:—జోహరూరు! చిన్ననాటినుండి యెన్నెన్నియో యిడుములంబడికన్నవారి కాళ్లుగడిగి యన్నమాఁబెట్టించిద్గొని తినిపెంచినయాకండల నాఖలుని కరవాలమునకు బలియిచ్చుటెటుల?

జోహరూ:—నిజము. నిజము. దుర్మరణమెవరు గోరుదురు.

జోరియా:—(వారిని సమీపించి) జోహరూరు! దేహారు! వందనంబులు. క్షేమమా.

జోహరూ:—అమ్మా క్షేమము. పట్టీ! ఇట్టివిజనప్రదేశములందు నీవొంటరిగా నేలసంచరించెదవు?

జోరియా:—జోహరూరు! నేనురానిచో నాకెవరాకలము లడవినుండి తెచ్చియిత్తురు? నాతాత సుద్దె గదా?

జోహరూ:—అమ్మా! కొండమీఁదనుండు "అస్మక్ బేగు" నిన్నెపుడయిననుఁజూచెనా?

జోరియా:—ఇపుడెయిదు దినములక్రిందట మాగృహంబునకు వచ్చియుండెను. అపుడునన్నుఁజూచెను.

(జోహరూరు, దేహారు లొకరిమొకరుగని తలయూఁచి నిట్టూర్పువిడుతురు.)

జోహరూరు! ఏల నిట్టూర్పు విడిచి వ్యసనపడియెదవు?

జోహరూ:—అమ్మా! నేనేమని వచింతును?

జోరియా:—నాయనా! వచింపరాని దుఃఖమదియేమి?

(జోహూరు, బేహారులు తమలోఁదాము నీవేయని వచించుచుందురు) (వారిరువురిని జూచి.)

అదిఱేమి మీముఖభావంబు లొకతీరుగ మారినది? కారణంబుఁ దెలుప సందియించుచున్నారు?

జోహూ:—తల్లీ! చల్లురవచ్చి ముంతదాపనేల? అక్రూరుండాస్మన్ బేగు నిన్నుఁబట్టితెమ్మని యాజ్ఞ యిచ్చినాఁడు.

జోరియా:—[గడగడవడకి తొట్రుపాటుతో] జోహూరు! సేనాయధికారికే యపరాధం బొనర్చితిని?

జోహూ:—బిడ్డా? తెలుకప కాఁడెవరొనరింతురు?

జోరియ:—తండ్రులారా! నాతాతయుంధుఁడును నారాకకుఁగాచియుందురు. నేఁడోయివచ్చితిను.

జోహూ:—తల్లీ! మేమీప్రపంచముపై నాశవదలినఁగదా నిన్నుగృహంబునకుఁ బోవదలనగు.

జోరియ:—జోహూరు! ఏమి యింతకఠినత వహించితివి? నాతాతముదుసలి. పైఁగాగుడ్డి. నాపైఁబంచప్రాణంబులుంచికొని జీవించినాఁడు. నేనున్నఁగాని యన్నపానాదులతనికిసమకూరవు. నేనెటువత్తును?

జోహూ:—జోరియా! ప్రపంచజ్ఞానంబు లేని బాలవునీవు. నీవువచ్చుట యెవరుగోరిరి? నేనే బలాత్కారంబుగ నెత్తికొని పోయెదను. [అనుచుఁబట్టును. జోరియా పట్టుతప్పించికొనుచు.]

శా. ఆహారాదులులేక వందురుచునుండా తాత నారాకకై
జోహూరూ! యిదియేమి? నన్వదలరా! జోహారులన్ జేసెదన్
ద్రోహంబేమియు నీకుఁ జేయనెపుడున్ దుష్కృత్యమీరీతి నా
కాహా! చేయఁగఁజేతులాడునటరా యాబాల్యమిత్రుండవై?

బేహారు:—జోహూరు! ఈయన్నుమిన్న పలుకులు ముద్దులుగులుకుచుండును. వానిని వినుచున్న మనకు గాలిపుట్టుట నిజము. అకతంబున మనముజచ్చుట నిజము.

జోహూ:—నిజము బేహారు! నీమాటలు నిజము. ఈచిన్నదాని ముద్దుమాటలు వినులంబడకముందే యెత్తికొని పోవలయును [అనుచుఁబట్టియెత్తుకొని నిష్క్రమింతురు.]

## తురీయరంగము.

జోరియ - లతీఫా - ఆస్మన్ బేగు - భీమక్క.

జోరియ:—[స్వగతము] [హా హా యని నిట్టూర్పు విడుచుచుఁ గన్నీరునించికొని.]

ఉ. అక్కట! యాదురాత్ములిటు [illegible] నక్కటికంబును లేక [illegible]
నెక్కడ కేమిసేయుదుగదా [illegible]
నిక్కమదేమొ చిక్కఁబడితిన్ దురదృష్టముచేత [illegible]
మక్కువఁబెంచు తాతకును మద్వ్యసనంబెటు [illegible]?

లతీఫా.— జోరియా! దానికిం గారణంబున్నది. నీవు సైనుమతస్థురాలవు. అతఁడో ఫిరాణి. మత తారతమ్యంబుంబట్టి నీతాత పరిణయంబున కొడంబడునో పడఁడో యను సందియము గలిగి తుదకీరీతినిన్నుఁ బిలిపించెను. రూపవతినింజూచి మోహించిన యౌవనపురుషుండిటు లొనరించుట యేమిదోషము? ఈపురుషవరేణ్యునిచే వరింపంబడితివి నీవెంతభాగ్యవతివో?

జోరియ.— లతీఫా! ఇట్టిభాగ్య సంబంధము నాకు ఎందనినఁ బ్రతిబంధకమేమయినం గలదా?

లతీఫా:— హా! హా! అటులనకు. ఇట్టివరుని వలదనుటకు నీకు నోరెటులాడెనే? ఎంతదౌర్భాగ్యవతివే నీవు? కోట్యధికారులబిడ్డలితనికరుణాపాంగావలోకనమున కుపాయనమిచ్చుచుండ నీభాగ్యవశమ్మునను పలబ్ధమైన యిట్టి నిధిని తృణీకరించుట తగునా? సిరిరా మోకాలొడ్డు విధంబు నీచందంబు.

జోరియ.— లతీఫా! నీవేమయిన దూషింపుము. నాకిట్టి సంబంధ మసమ్మతము.

లతీఫా:— ముగుదా! నీమూర్ఖతచేఁ జేటుమూఁడునని మున్నున్నుగా ముమ్మారు మున్నరించి పలికెదను. నీసమ్మతి యున్ననేమి లేకున్ననేమి. నెయిలిక్కటినీరు వేఁటకానికిముద్దా? బలవంతులు తలఁచినపని బలవంతమ్మున నయినను బరిణమించును. సమ్మతించినచో సుఖమ్ము ననుభవించు,

జోరియ:—(కన్నీరుగార్చుచు) తల్లీ! లతీఫా! అటుబలాత్కార సమయంబుఁ దటస్థించెనేని నీవు నాకు సాహాయ్యపడియెదవు గదా?

లతీఫా:— (తలద్రిప్పుచు) నేనా! మంచిపని! నిముఁబోలు నిర్భాగ్యకుఁ దోడ్పడితినేని నీకంటె నిర్భాగ్యనగుదు.

జోరియా:— లతీఫా! ఈపాపిగృహంబునుండి నన్ను వెలువరించు తెరవెద్దియును లేదా?

లతీఫా:— చాలుఁజాలు. రేపురాత్రి నీకుంబరిణయంబగు. పిదప నీవే నీప్రియునింగూడి యానందరసాబ్ధి నోలలాడుదు వీటినుండి నన్నే వెడలింప వెరవు వెదకుదువు.

జోరియ:—(హా! యనివడఁకుచు గన్నీరుఁగార్చుచు) తల్లీ! లతీఫా! నీ కన్నబిడ్డవలె ననుమన్నించి యీదురాత్ముని బారినుండి తప్పించి నాయిల్లుచేర్పవే. నీపాదంబులఁ బడియెదను (అనుచుఁ బాదములుబట్టుకొనును.)

లతీఫా:— జోరియా! ఇదియేమి పావమే? చరణములు బట్టుకొనియెదవు. లెమ్ము. అదిగో నీప్రియుఁడు "డాస్మక్‌బేగు" వచ్చుచున్నట్టున్నది. అతనిని వేఁడికొమ్ము. నేఁబోయెద (అనుచు నిష్క్రమింపయత్నించును.)

జోరియ:— తల్లీ! నన్నొంటరిగా నాకంటకుని బారికి వదలి పోనగునా? వలదు వలదు.

(అస్మక్‌బేగు ప్రవేశించును. లతీఫా నిష్క్రమించును)

అస్మక్‌బేగు:—(జోరియానుఁజూచి తలయూఁచి చిఱునవ్వునగుచు) సుందరాంగీ! నమస్కరించితి. ఎంతటి గొప్పదినంబిది? నీదర్శనలాభంబుచే నాలోచనయుగళంబు ధన్యతఁగనె. ఎలనాగా! ఏల ననుఁజూచి దేహంబుదాఁచుకొనియెదవు? పార్వణశర్వరీశాననా! నీవుసర్వాంగసుందరివి. త్రిజగన్మోహినివని నేవలచి విరాళినొందితిని. మరాళరాజగమనా! నీస్మితవికసితముఖకమలం

* సం. అంగనునే యిటు లంగన మున్నను నారడి సేయుట గామాంధా!

అస్మార్ బేగు:—అంగనా! నీరుచి రాంగముజూచిన నంగజుఁడే రాగాంధుండౌ

జోరియ:— సంగతమేయిది సాహసవృత్తిని సాదుల నేపట? క్రూరాత్మా!

అస్మార్ బేగు:—క్రుంగఁగ నన్నిటు క్రూరుఁడువూరుఁడు కోమలి! చేసెద ధర్మంబే!

అంగనామణీ! పంగెనలకిది సమయముకాదు. వలచి భరించి తెచ్చికొనిన వనితను నిన్ను వలదనిన వదలువాఁడనుగాను. మోహపరవశుఁడను. బలవంతమ్ముగ వైవాహికవిధి బరిణయము చేసికొనియెదను.

జోరియ:— ఓరిదురాత్మా!

గీ. వాలుఁగంటిని నెవఁడేని వాలయించి
కలయఁబూనినఁ గలుషాగ్ని గాల్పఁగాదె
వలము బలవంత! తగునె దుర్బలులపైన?
వలదు బలవంతమిది బలు వంతయగును.

ఓరిదురాత్మా! వారిజనయనలు పౌరుషహీనలని తలంచకుము. మగువ తెగించినఁ బ్రాణంబు తృణంబుఁగఁగణించు. అటు బలాత్కరించిరేని నీ వశవర్తినగు నాపాతివ్రత్యము మాసిపోవు గాదు. స్త్రీవాక్యదోషంబు కీలికీలలకంటెఁ గ్రాలి కలకాలము నిన్నుఁగాల్చును.

అస్మార్ బేగు:—కం. శాతోదరి! శాపములకు
మాతలు వనజాక్షులనెడి మాటలు మృషలే?
నీతోడ వాదులేలఁక
ఖ్యాతిగఁగల్యాణమగుచుఁ గలతును రమణా.

సారసాక్షీ! నీశాపములకు భీతిలువాఁడనుగాను. శారీరమానసత్వ వాదవ్యాఖ్యానంబు నీవలన వినుటకు నేనిచటికి వచ్చినవాఁడనుగాను. శరీరము వెంటనే మనసు గాక వేఱొకటి యున్నదియా? .

[లతీఫాయని యఱచును. లతీఫావచ్చును.]

లతీఫా! నీ దుష్టబుద్ధికి దృష్టాంతమిప్పుడే చూపితిని. నా పరిణయమునకును వధకును నీవడిగిన తేప్రతాత్రిక సిద్ధపఱచవేని నీకగు శిక్ష ప్రాణాంతమువరకే నుండునని నాఁడను. ప్రాణముపై నపేక్షగలదేని నీవు జాగరూకవైయుండెదవు.

[అనుచుఁ గోపమున నిష్క్రమించును.]

---

* ఇదినూతనవృత్తము. వింశతిచ్ఛందంబగు కృతియందు 28097-వ వృత్తము. భా. భా. భ. మ. గ. గ. గణములు 7-13 యతులు ( పాటగఁబాడఁదగు )

లతీఫా:—(స్వగతము.) వీనితోనహవాసము "వ్యాళీవదనముధిబిన" న్యాయమును సరించినది. అక్కపైనఁ గోపము తక్కపైనఁ దీయుచున్నాఁడు (జోరియానుఁజూచి) నాపాలికి మంచిగట్టివానవు దొరకితివి. నారొమ్మునఁగుంపటి పెట్టితివి. నాప్రాణముపై నువ్వున్నావు. వానిఁబొందుటకు నీవుసమ్మతింపవు. నిన్ను వదలను వాఁడనుమతింపఁడు. నడుమ గండమునాకు. చంపపెట్టాకచోట గోతపెట్టాకచోట. అయ్యో! బిడ్డా! జోరియా! నీవు కార్యాకార్యములాలోచింపవేలకో ఈ మూర్ఖతనుండి ఫలంబేమి? ఎటులనయినను నిన్ను వాఁడు గలయుననునది స్వతస్సిద్ధము. మానభంగమైన పిదప శేషమయిననేమి? ప్రాణంబు వదలెదవా? దానినుండి లాభమేమి? నాహితమువినుము. వానిఁబొంది సుఖమునందుము. అఁదుపుట్టువరై పుట్టినవు దెవనినోయొకనిఁ గట్టికొనవలెనుగదా? ఆలోచింపుము. నెమరువేసి నమలుము. త్వరపడకుము.

జోరియా:—(కినుకతో) లతీఫా! ఇట్టి మాటలాడకు. చేతనయిన నాకుండోద్బుడును కాదేనిఁ గూతలిడక నీదారి నీవుబొమ్మా. ఇట్టి హితశత్రుత్వము నెఱపకుము. నీయుపదేశంబు నాయందు సిద్ధింపదు.

(భీమక్క, లతీఫా, లతీఫాయని యఱచును.)

లతీఫా:— భీమక్కా! వచ్చితివా? తమలపాకులకట్టలు తెచ్చితివికాఁబోలు? ఇటుతెమ్ము [అనుచుఁ గట్టలందికొని], భీమక్కా! ఇచట నేయుండుము కట్టలులోననుంచి వచ్చెదను. [అనుచు నిష్క్రమించును.]

జోరియా:—[భీమక్క పాదములపైఁబడి] తల్లీ! ననురక్షింపుము. నాతాత బలదుర్గమునందు దర్యాషుకు నాయునికిఁ దెలుపుము. ఈదుష్టాత్ముం డాస్మర్ బేగు నన్ను భటులచేఁబట్టి తెప్పించినాఁడు. బలవంతమ్మున నాపుపరిణయము చేసికొందునని నిర్ధరించినాఁడు. అయ్యో! తల్లీ!

సీ. జననాది నాదు జీవనమిటు వనటలఁ
గనిమనుటయ్యొనే? కన్నతల్లీ!
మానముగదవె యీమహిని మానినులకు
మానని భూషయై మహిమఁగాంచు
కన్నులుగానకయున్న నాతాత యే
పన్నములంబడి సన్నగిలెనొ
ఉల్లమునందిటు తల్లడమందుచుఁ
దల్లిరో! మనఁజాలఁ గల్ల గాదు

తే. గీ. గడియ యుగముగ గణియించి పడినదాన
గంటకంబున జాతీవ కళికబలెను
ఏమిసేయుదు? భీతినాకేమితోఁప
దకట! నాగతి శీపావమయ్యె నేఁడు.

(అనుచు మరల పాదములుబట్టుకొనును)

భీమక్క:—(జోరియాను లేవనెత్తి) బిడ్డా! ఊరడిల్లుము. నీకుశుభ్యంబు సంభవించు. నాకును నీవంటి బిడ్డలున్నారు. అయ్యో దుర్మార్గుఁడా! అందఱిట్టివారుండినఁ బ్రపంచమే ఘాతకునుగవారి కలుషమున నీమవాఁడు కలఁతలో మునుఁగకపోఁడు. లతీఫా వచ్చుచున్నట్లున్నది.

( లతీఫా ప్రవేశించును. )

లతీఫా:—(భీమక్కనుంజూచి) భీమక్కా! రేపు మాదొరగారి వివాహము. తమలపాకులకట్టలు నూరు తీసికొనిరమ్ము. చీకటిపడును వెళ్ళిమ్మె వెళ్లుము.

[భీమక్క నిష్క్రమించును.]

(జోరియాకుఁజూచి) అమ్మా జోరియా! నాపలికిన హితమ్ముఁ జక్కఁగనాలోచింపుము. మూర్ఖతవదలుము.

జోరి:— అమ్మా! రాతిని నానవేసిన మెత్తనగునా! నీహితమ్ములు నాకు విహితమ్ములగునా?

లతీఫా:— నీ తలవ్రాఁత. ఏమయినను జేసికొనుము. నామాట నీకురుచింపదు. వానిపట్టుదల గోధా పుచ్ఛమువంటిది. గోవృషన్యాయమున నినువదలక వెన్నంటినప్పుడు నామాటతలఁచికొని యేడవు. నేఁబోయెద.

(నిష్క్రమించును)

జోరి:— హా! ఇట్టిదికదా దైవవిచేష్టితంబు. దీనిఁగడవనెవరివశము? రేపటి గండమునకు నేఁడు గుందనేల? దైవముపై భారముంచి నిద్రించెద.

(నిష్క్రమణము.)

పంచమరంగము.

జలదుర్గము - దర్వేషు - రంగనాయకి - భీమక్క.

దర్వేషు:—(కన్నీరుఁగార్చుచు) హా! దైవమా

సీ. నా ముద్దుమనమరా లేమాయెనో!
యేల రాదాయెనో? యర్ధరాత్రియయ్యె
కాంతారమున దారిఁగానక చిక్కెనో?
రాలెక్కతటి జాతి నేలఁబడెనొ?
వ్యాఘ్రభల్లూకాది వన్యంబులకు భక్ష్య
మయ్యెనో? యహిదష్టయయ్యెనొక్కొ!
కాముకవంచనా క్రాంతయై దక్కెనో?
కారణం బిదియని కానరాదు

తే. గీ. అంధుఁడను నేను మార్గము నరయలేను.
కావ కెటుపోగ? నాచిన్నదానివార్త

యెటుల తెలియుదు? దైవమా! యెవరుదిక్కు?
ప్రాణభిక్షనిమ్ముఁగాఁజాల బాలలేమి.

హా! జోరియా! జోరియా! ముద్దులబిడ్డా! నాప్రాణమా! రాకనిలచితివేల? అకటకటా! విషమగ్రావంబుల నెక్కి యాకలముఁ గోయుచు జాతి నేలంబడి స్మారకముదప్పినా? స్వోచితాహారార్థ సంచారక్రూరమృగాళుల బాలికం జిక్కితివా? కుటిలకాముకవంచనా వాగురులం బడితివియా? అయ్యో! జోరియా! దుర్భరజరామయగ్రస్తావస్థ చిత్తుఁడనై యసహ్యాంధతాంధకారంబునంబడి దిక్కుఁగానక భూమికి బరువుగా బ్రతికెడి నాకుం బ్రాణాధారంబుగనుంటివిగదా! నామాయుఃప్రాణంబుగా ననుఁబోషించుచుంటివికదా! బిడ్డా! నీ వడవులకుంబోయి యిడుములం బడుట నేఁజూడలేనని యెన్నిమారులు బలికినను తాతా! మనకుఁగావలసినది యెవరుదెచ్చియిత్తురు? మనకెవరుదిక్కు? దైవానుగ్రహంబుండు వఱకు మనకేయపాయంబు రాదని నన్నూఱడించు చుంటివి కదా? పట్టీ! నీవు వయోఽధికురాలవయితివి యింక బాహ్యసంచారంబు లోకనిందయనిన తాతా! చిత్తశుద్ధి గల మత్తకాశిని యెత్తటి సెచటయున్నను నిందరాదని పలుకుచుంటివి కదా? జోరియా! నీవియోగంబొక నిమిషంబైన సైంచనోపుదునా?

మ. అవనీతుం డవనీశుఁడాజ్ఞయిడె నా యక్షిద్వయం బల్లనాఁ
డవియం గొట్టఁగఁ బుట్టదాయె వ్యసనం బానాఁడు నాకింతగా
నువిదా! నీవిపు డింటఁగానమి నయో! యుల్లంబు దావాగ్నిచే
దవులం బడ్డటు దహ్యమయ్యె వశమే? తల్లీ! యిలన్నిల్వఁగన్.

హా! ఈ శరీరము దుర్భరము దుర్భరము. జోరియా! నాకెంతదుఃఖముండినను తాతా! యని నీవు నను బిలిచినతోడన నాకెంతసంతోషముద్భవించుచుండెను గాదా? ఇప్పుడేల యింతటి దుఃఖాగ్నిం గ్రాలుచున్న నను జూడక మాటాడక మఱుగుపడితివి? నీవులేని నాజీవమింక నుండనేమి? యుండనేమి? హా! జోరియా! జోరియా! (అనుచు నేలంబడి యుండును.)

(రంగానాయకుని ప్రవేశము.)

రంగా:— (స్వగతము) ఏమియిది? ఇంతరాత్రియయినను వీరుతలవాకిలి తెఱచి నిద్రించుచున్న వారు. (అనుచు ముందటికిఁబోయి నేలంబడిన దర్వీషునిఁజూచి) ఏమండీ! దర్వీషుగారు! నేల నేల పరుండితిరి? ఏమీ! మాటలాడకయున్నారు? నేను మీశిష్యుఁడు రంగనాయకుఁడు. మీ క్షేమంబు విచారించికొనిపోను వచ్చితిని.

దర్వీషు:— (లేచి) హా హా! రంగనాయకా వచ్చితివా? నా జోరియా నెచటనయిననుఁ జూచితివియా? నేఁడు మూఁడుజాములప్పుడడవికి నాకలములకైపోయి యర్ధరాత్రియైనను రాక తడసెను. ఒకగడియ హెచ్చుగ వెలుపట నిలువ వెఱచు బాలిక యేకారణంబున నెందు నిలిచెనో తెలియదు. నాకేమో భయమయ్యెడు. రంగానాయకా! నేనేమిసేయుదు? నాయునికి వ్యర్థము. వ్యర్థము.

రంగా:— (తిచ్చపడి చేతులుపిసికికొనుచు) (స్వగతము) ఇది యీ షండాలుఁ డాన్మక్ బేగు కృత్యము (ప్రకాశముగా) దర్వేషుగారు? మీరూఱడిల్లుడు. దుఃఖింపంబనిలేదు. నాభటు లఁగొందఱినింబంపి వెదకించెద.

(భీమక్క ప్రవేశము.)

రంగానా:—(భీమక్కనుఁజూచి) క్షేమమా? భీమక్కా!

భీమక్క:—అయ్యా! దుర్మార్గుల రాజ్యంబున క్షేమమెచటనుండి వచ్చును?

రంగానా:—ఏమి! అటు మాటలాడెదవు? నీకేమిదుఃఖంబు సంప్రాప్తించెను?

భీమక్క:—నాకేమిదుఃఖంబు గోరెదవయ్యా? ఒకరికి చేదు వచ్చినది తీపు మనకుఁ గదా? నాకును వయస్సు కూఁతురొకతె యున్నది.

రంగానా:—ఏమీ భీమక్కా! సంబంధములేనిమాటలాడు చున్నావు? ఒకరిదుఃఖంబునకును నీవయసు కూఁతురునకు సంబంధమేమి?

భీమక్క:— ఏమయా! ప్రాయంపుఁ బడుచులనుఁజూచిన వడుపఁగొడుకాంధ్రుఁడుఁ గన్నులుమండి మిడి సిపోవుచుండును గదా? మీబోటివయోవంతుల బ్రతుకంతయునింతయేగదా? వయసోవల్ల కాడోయనియుండవా?

రంగానా:—ఏమితల్లీ! అటు మాటలాడెదవు? పరభామలను దమమాతలుగాఁ గనుటయే మాజాతినీతి కదా?

భీమక్క:—అయ్యా! పులికి నీతియుండినంగదా జాతికి నిలవచ్చును?

రంగానా:—తల్లీ! నేనుగాని నాజాతివారెరుగాని నీకే యపకృతియొనరించితిమి?

భీమక్క:—అయ్యోకర్మమా! ముసలిముండకు నాకు నెవరే యపకృతియొనర్తురు?

రంగానా:—భీమక్కా! నీబిడ్డకయిన నెవరేమిసేసిరి? అట్టి దుష్కృత్యము లెవ్వడుగాని సేసి యుండఁ గడు మేము?

భీమక్క:—అయ్యా! బంగారువంటివారు మీరేమిసేయుదురు? దారిలోనొంటరిగా నవాథలు దొరకి నచో వారిని దోఁచికొని పోదురు. ఇంతే. మీరు దోఁచినధనము మరల సంపాదింపనగు.

రంగానా:—భీమక్కా! మరి వారు దోఁచినధనము మరలసంపాదింపనలవిగాదు?

భీమక్క:—దుర్మార్గులచే నపహరింపఁబడిన స్త్రీల మానధనము.

రంగానా:—భీమక్కా! ఏ దుర్మార్గుఁడే మానినీ మానధనంబు దోఁచెను?

భీమక్క:—[ ఆలోచన నభినయించి ] అయ్యా! నీవు నా ప్రాణంబునకు ముప్పుఁదెత్తువు. పెద్దవారి జోలి నాకేల?

రంగానా:—తల్లీ! నీమాట రహస్యముగానుంచెద. వెలువక పలుకుము.

భీమక్క:—[ పలుదిక్కులంజూచి ] ఈ ముసలి దర్వేషుగారి మనమురాలిని "అన్నూబేగు" ఎత్తి కొనిపోయి తనయింట నుంచికొనియున్నాడు.

దర్వేషు:— హా! హా! ఖోరియా! ఎంతటి దురాత్మునిచేఁ జిక్కితివి? నే నిప్పుడేమి సేయుదును? [ అనుచు ఏడ్చి ] హా! హా! రంగానాయకా!

ముఖించెద. (ఆలోచనసభినయించి) ఉద్వాహంబునకు ముల్లా యేమిఘాతంబు చేయునో? ముల్లానాపై ద్వేషంబు సాధించుచున్నవాఁడు. సేనాధికారులు కొందఱు వానిపక్షమవలం బించియున్నవారు. మతపద్ధతిననుసరించి కన్యాపక్షంబువారెవరని ముల్లాప్రశ్నించిన నే నెవరినిఁజూపుదు. లేనినఁ గన్య నే సభలోఁబిలిచికొనిరమ్మని సాధించును. అప్పుడావనిత తన్ను బలవంతమునఁబట్టి తెచ్చినాఁడనిన నా కార్యమునకు భంగంబుగలుగును. ఏమిసేయుదు? ఎటులనయిన మాయిరువురికి వివాహంబయినదని మతగ్రంథ పుస్తకంబునఁ జేరవలయును. అటులనయినచో నాకెవరిభయముండదు. అటుకానిచో నీశశిముఖి శాశ్వతంబుగా నాకు దక్కదనుట సందియంబు ... హా హా! తెలిసెను తెలిసెను. ఇదికదా శేముషీవిశే షగు. ఈముల్లా నామాటనమ్మకము మీఁదఁబుస్తకమునందుఁ బరిణయంబు లిఖింపఁడేని .........అటుచేసెద.

(రఘునాథుని ప్రవేశము)

రఘునాథా! నీకు నెయ్యేండ్లాయువు. తలఁచినగడియనే వచ్చితివి.

రఘునా:— చాలునండీ! మానవుల యాయుర్దాయంబు శతవత్సరంబులని యుండగనే వారెన్నిన్నియో పోకడలుపోవుచున్నారు. నెయ్యేండ్లాయువయిన వారినిఁబట్టుటకు రెండు సంకెళ్లు చాలవు. కథకు కాళ్లులేవు ముంతకుఁ జెవులులేవు. ఈ మాటలకర్థములులేవు.

అస్గర్:— అవునయ్యా అవును. నిజముపలికితివి. రఘునాథా! నీవెల్లప్పుడు నావద్ద విప్రవినోదములు సలుపుచుందువు. నేఁడొక విపరీతవినోదంబు సలుపవలె. అదిరహస్యము. మాటయిచ్చితివేని నీకుఁదెలిపెద.

రఘు॥ నా:- అయ్యా! ఇన్నిదినంబులు నీపోష్యవర్గమునఁజేరి యీదినంబున నీకై యొకవినోదంబు సలుపు వెనుదీయుదునా? విప్రులు ఫలాపేక్షితులు. ఫలమిచ్చినన్ను నెట్టికార్యంబైనను జేయ నోపుదును.

అస్గర్:— రఘునాథా! ఫలమునకేమికొఱఁత? కార్యసాఫల్యమయ్యెనేని నీకు నూఱువరహాలిచ్చెద.

రఘునాథు:- మురమురదితి. కొసేవాబిడ్డకుఁ బెండ్లిసేసెద. అయ్యా! మి కార్యంబేమి? నిస్సందేహముగఁ దెలుపుడు.

అస్గర్:— రఘునాథా! నిజముబలికెదనువిను. నేనీభోగినుల భోగములఁ పేసారి పెండ్లియాడఁగోరితి.

రఘునాథః- సంతోషము సంతోషము. పెండ్లియా! ఇందులకేలరహస్యము? అవశ్యముగానిమ్ము. దేశ దేశములకుంబోయి తగినకన్య నన్వేషించివత్తునా?

అస్గర్:— అశ్రమ నీకువలదు వలదు. సర్వము నేనప్పుడే సిద్ధపఱచుకొనియున్నాను. ఇఁక నొకరెండు గడియలకు వివాహము.

రఘునా:- సరి సరి మురమురదితి " శుభస్యశీఘ్రం " కానిమ్ము.

అస్గర్:— ఈ వివాహవిషయంబున నీనుండి యొక్కసాహాయ్యము గావలయును.

రఘునా:- అయ్యా! అదియేమి? సందియించెదవేల?

రఘునాథా! తెలిపెదనువిను. మాయిరువురికి ఖాజీయేనాదే పెండ్లికాదు. ఇప్పటిముల్లాకును నాకును ద్వేషము.

రఘునాథ:- ఇందులకేల యింతచింత? మఱియొకముల్లాను వేఱుగ్రామమునుండి పిలిపించినచో నతఁడు కార్యంబు నెరవేర్చును. అయ్యవారులేకపోయిన నమావాస్య రాకనిలుచునా? ఈ ముల్లా రానిచో వేఱొకముల్లావచ్చి పనిముగించును.

ఆస్మక్‌బే:--పెండ్లి యిప్పుడే కావలయును. వేఱొక్కముల్లా వచ్చునంతపట్టున నాలస్యంబుగూడదు. ఈ ముల్లా యధికప్రసంగియైకన్యను సభకుఁబిలిచికొనిరమ్మని సాధించును. ఆకన్య నన్నుఁ బెండ్లియాడుటకు నిష్టపడదు. ఆకన్యను నేఁడేపెండ్లియాడి దానింగూడవలెను. పెండ్లిలేక కూడినచో భోగిని యగును. ఈదినమునఁ బెండ్లియయిననుఁ గాకయున్ననుఁ బెండ్లియయి నట్టె యాయింతి నమ్ములాగు మోసగించి దానింగూడవలెను. పిమ్మట నిజమయినపెండ్లి చేసికొని మతసంబంధపుస్తకములో వ్రాయింపనగు.

రఘునాథుఁ:-మీమాటలు వినినచో నన్నే ముల్లావేషము వేయుమని యందురుగాఁబోలు, చిత్తము. అటులనే వేసికొని వచ్చెద.

ఆస్మక్‌బే:--రఘునాథా! ఆతురపడకుము. ఈపురి ముల్లాను నేనపుడేపిలిపించినాను. అతఁడువచ్చు సమయంబైనది. ఆకాలంబున నీవు కన్యావేషంబుదాల్చి నన్నుం బెండ్లియాడ సమ్మతమని పలుకవలయును. నీ పేరేమనిన జోరియా యని తెలుపవలెను.

రఘునాథుఁ:-ఏమండీ! జోరియాయెవరు? జలదుర్గం దర్వేషుగారి మనమరాలా?

ఆస్మక్‌బే:--నిజము, నిజము.

రఘునాథుఁ:-హా హా! మంచిసుందరి. మీకుందగినది. కలయిక కుదిరినది.

ఆస్మక్‌బే:--ఆ పడుచువేషంబు నీవు దాల్పవలయును.

రఘునాథుఁ:-అయ్యో! అటుసేయుటకు దుష్కర్మ కావలయునే? నేఁడమావాస్య. పైఁగారాత్రి. పైఁగానేను బ్రాహ్మణుఁడను. పైఁగా రేపు మాతండ్రితిథి. అంతకుఁబైఁగా నాభార్యగర్భిణి.

ఆస్మక్‌బే:--రఘునాథా! ఘోరంబువలదు. నిండా బిబ్బీలముసుఁగు వేసికొనినంజాలు.

రఘునాథుఁ:--అటులయిన నాపని సంతోషముగాఁ జేసెద. వేసాలన్ని గ్రాసాలకు! అయ్యో! నెలపున కిపుడేమయిన నిత్తురా? పిల్లపాపలు పస్తుపడినారు.

ఆస్మక్‌బే:--దుడ్డుకేల తనకలాడెదవు? ఇకార్యంబయిన తోడన యిచ్చెద.

రఘునాథుఁ:--మంచిదండీ! అటులనే యిత్తురుగాక. నాకు వేషంబువేయను పరిచారికరా లుండవలెను గదా?

ఆస్మక్‌బే:--నిజము (లతీఫాయని యఱచును.)

( లతీఫా ప్రవేశము. )

లతీఫా:— ( ఆస్మక్‌బేగునుజూచి ) ఏమండీ పిలిచితిరి?

ఆస్మక్‌బే:--లతీఫా! నీవిపుడీ రఘునాథుని చేతిక్రిందనుండి యతఁడు చెప్పినపనియంతయును మీఱక చేయుచుండుము.

లతీఫా:— ఏమండీ! అటులాడెదరు? వానిపని నేఁ జేయవలెనటండి?

ఆస్మక్‌బే:—మీఱితివేని దుర్మరణమే గతి.

రఘునాథు:--లతీఫా! నీకేసందియము వలదు. వీరు పెండ్లికిఁ ద్వరపడుచున్నవారు. మనము వలనే త్వరపడవలెను.

లతీఫా:— ఏమయ్యా! నీబోఁటివికిరమొత్తికొను వానిని నేఁ బెండ్లి యాడవలెనా? అయ్యో! గ్రహచారమా!

రఘునాథు:—కాదు. మనవారి పెండ్లికిఁ దగిన సంతోషమును త్వరలోఁ దెలుపవలెనంటిని. నీకీ భయమును వలదు. రమ్ము పోదము. నీవు చేయఁదగిన పనియంతయును జెప్పి చేయించుకొనియెద.

ఆస్మత్ బే:--లతీఫా! నీవు మారాడక పొమ్ము. వెళ్లుము.

(లతీఫా, రఘునాథుఁడు, నిష్క్రమింతురు.)

ఆస్మత్ బే:--(స్వగతము) వివాహకాలం బాసన్నంబయ్యెను. ఆపాపి ముల్లాయనువాఁడు వచ్చి నాతోఁ గాలుద్రవ్వి కలహించును. నేనాతని గొంచెము వారిపక్షమూనియుండుదును. కానిమ్ము వచ్చినదంతయు రానిమ్ము వీనం బొక్కటిగాఁ గాదనిమ్ము. నాతోఁ గలహింపనిమ్ము. పరిణయమ్ము శాస్త్రార్థముగదా? ఈదినంబునఁ గాదన్న లేపగును. హా! ఆ యంగన సంగమ సుఖంబు లేనిచో నొకనిమిషమాత్రంబయిన మనసు నిలుపఁగలనా? ఆభామామణి రతికేళీ సుఖంబీ రాత్రి యవశ్యానుభావ్యంబు. ఇది నా నిర్ధారణమ్ము. దీనిం దప్పింప ముల్లాకాదు ముల్లానుబుట్టించిన తొత్తుకొడుకు వచ్చినను దుర్లభము. మంచిది. ఎవరెవరేమేమి నేయుదురో చూచెద.

కం. ఇల్లాలుగఁ జేసెద నా
హల్లకసుమగంధి నెవ్వ రడ్డంబైనన్
ముల్లా వలదనినను గా
నల్లా వలదనినఁగాని యతివను వదలన్.

(ముల్లా, ఖాదర్ బేగు, హైదరుబేగు, ప్రవేశము.)

హా హా! రండి. రండి. నమస్కారములు నమస్కారములు. కూర్చుండుడు. కూర్చుండుడు. ఇచట ఇచట. క్షేమమా? క్షేమమా?

ముల్లా:— హెూహెూ! ఆస్మత్ బేగుగారు! ఏమియిది? అకస్మికముగా వివాహము దలంచుకొని పిల్లను దెచ్చికొని ముహూర్తము నిర్ధరించికొన్నారు? ఎంతటిసాహసవంతులయా మీరు?

ఆస్మత్ బే:—అంతయును దమ యాశీర్వాద ఫలమండీ.

ముల్లా:— శుభము శుభము ... ఏమండీ! పెండ్లికి మీతలిదండ్రులు వేంచేసినారా?

ఆస్మత్ బే:—(ప్రక్కమరలి యేమేమోగొణుగుదు) లేదండీ. వారిచటికి వచ్చునంతటి యవకాశంబు లేదు.

ముల్లా:— హెూహెూ! తల్లిదండ్రులుండియును లేనిపెండ్లియాయిది? మంచిదండీ. పెండ్లికూఁతురు తలిదండ్రులయినను వచ్చినారా?

ఆస్మత్ బే:—(కోపము నణచికొని) వారెందుకు రావలయును? పెండ్లికూఁతురొకతె వచ్చినం బెండ్లికాదా

ముల్లా:— అటుకాదండి! పెండ్లికూఁతురు కులగోత్రములు దెలుపుటకును నోలినిర్ధరించుటకును నాఁడు పూర్వము వారుండవలయును. తలిదండ్రులుండవలెను. వారు లేకున్న నన్నదమ్ములుండం?

ముల్లా— [తలయూఁచి] నీపయినేమి.

పెం॥కూ॥— నలుబది. కాదు కాదు కాదు. పదారేండ్లు [ముల్లా సందేహముతో హైదరబేగు ఖాదర్ బేగుల మోము జూచును వారుతమ సందేహము తెలియఁజేయునటుల తలయూఁచెదరు.]

ముల్లా:— నీతలిదండ్రుల పేర్లేమి?

పెం॥కూ॥— (ఆ॥గ॥ చిక్కితిని. అడిగి తెలిసికొనుటకు మఱచిపోతిని)

(ప్రకా.) తలిదండ్రులపేర్లు పలుకుట మా కులమర్యాద గాదు.

ముల్లా:— ఏమీ! తలిదండ్రులపేర్లు చెప్పఁగూడదని యేశాస్త్రములో నెచటను లేదు. [అస్మదేగు దిక్కుఁజూచి] ఏమండీ! జననీజనకుల పేర్లు దెలుపుట విధాయకము. నిషిద్ధవిధి యెచటను లేదు. కన్యయజ్ఞాత మాతాపితృకయయ్యెనేని సభలో మోము ముసుఁగువిప్పి గుర్తింపఁదగిన చిహ్నాలన్నియును వ్రాసికొనవలెను. అటు సేయుట సమ్మతమా?

అస్మద్ బే:—(కినుకచే) ఓరి ముసలిముండకొడుకా! ఖాజీయనియేడ్చినాదార మోముఁజూతునందువా? ఛీ పలువా! తులువమాటలాడకు. నాయిలు వెడలుము.

(హైదరుబేగు, ఖాదర్ బేగు, కోపంబుతో లేచి)

హైదరు:—ఏమి! అస్మద్ బేగు! తలక్రొవ్విమాటలాడెదవు! పొగరా? ముల్లా ముసలియని నిర్లక్ష్యమా? ముల్లా ముదసలియైనను మతము ముసలిదియా? మానమర్యాదలకు ముసలితనము వచ్చెనా? ఇచటనుండు మేము పౌరుషహీనులని తలంచితివియా? మతగురువును మతకరింపఁజూచెదవా? అధికారమున్నదని నెమలివలె నిక్కి గర్వించిమాటలాడితి వేని నీకండలు తుండ్లుగా నఱకుదుము. తలిదండ్రుల నామంబుచ్చరింప లజ్జించుమానిని యొకమానినియా? ఇదిగో దీనిముసుఁగుఁ దీయుదుము. పౌరుషముండెనేని నీశౌర్యముఁజూపుము. మాతరవారమున కాపాలిగమ్ము [అనుచుఁగన్య మోముముసుఁగుఁ దీయుదురు]

రఘునా:— ఛీ! ఛీ! చండాలులారా! నాసిగ్గుచెడిపితిరి. [అనుచుఁబరుగిడును.]

ఖాదరు:— ఓరీ! నీచాధమా! ఇట్టికృత్రిమోపాయంబులచే నెవరికొంపలు గూల్పనెంచితివి? కపట వర్తనలు సార్థకఫలములిచ్చునా నీ ముఖావలోకన చేయందగదు. [ముల్లానుఁజూచి] ముల్లాగారూ! ఈ పాపియింట నిలువంజనదు. లెండు పోవుదము.

(నిష్క్రమింతురు.)

(అస్మద్ బేగు చింత చేఁదలవంచికొని యాలోచించుచు.)

అస్మద్ బే:—[స్వగతము] హా! పనిచెడెనుగదా? ఏమిసేయుదు? మార్యాద మూడుకాసులకుఁబోయెను. సరివారిలోఁ దలవంపులయ్యెను. దుష్ప్రవర్తనచే సత్ఫలము కలుగునా? అధికారగౌరవము నైతముత్గ్గెనుగదా?

సీ. అధికారగౌరవ మాఱడిపాలాయెఁ
గులకీర్తి మూడుకాసులకుఁ బోయె
సరివారిలోపల నడికి నాకరమాయె
వనితలలోఁదలవంపులాయె

ఇలుపన్న వాసియు మలినమై పోవంగ
          వలిదంష్ట్రలు సురిగి ... పోవు
కానివారికి నోటికావరమెచ్చెను
          శీలసంపన్నత కాలిపోవు

గీ. పోవు పోయిన దెల్లను బోవనిమ్ము
    గతమునకు దుఃఖపడ నేల? గలుగఁబోవు
    కార్యసాధనఫలమెల్ల గాంచనిక్కఁ
    జేసి ముదమున ముసిఁగెద పాసిపు.

హా! ఏమయినను దగ్గనిమ్ము. ఏమయినను బోనిమ్ము. మానము చెడనిమ్ము. కులము నాశనము కానిమ్ము. మతము చితిఁగలయనిమ్ము. పేరునీటుగానిమ్ము. అధికారము వ్యర్థగానిమ్ము. ప్రాణము పోనిమ్ము. ఆ జోరియా సంగమసుఖానుభవము కలిగినంజాలును! ఈ రాత్రియే యొనఁగూడవలెను. పెండ్లియైన్నఁడైననేమి? ... హా హా! [ఆలోచననభినయించి] సరి. సరి. బంగరుకు నంగనకు లోఁబడని వాఁడెవఁడు? కైబావిముల్లాకు ద్రవ్యాపేక్ష మెండు. వానింబిలిపించి నా యిష్టాను సారంబు కార్యంబు నెరవేర్చుకొనియెద. (జోహరారని యఱచును)

[జోహరారు ప్రవేశము.]

జోహరారు! నీచేతికొక జాబిచ్చెద. కైబాపికి వెళ్లి యచ్చటి ముల్లాను పిలిచికొనిరమ్ము. నీవెంట వంద రూపాయలు తీసికొనిపొమ్ము. అతనికిమ్ము. అతఁడు వచ్చునంతవఱకు నచటనే యుండి పిలిచికొనిరమ్ము. (అనుచు జాబువ్రాసి జోహరారునకిచ్చును జోహరారుచిత్తమనుచు నిష్క్రమించును.) [రఘునాథుఁడు అబూకరను ముల్లావేషమును దాల్చి ప్రవేశించును.]

అబూక:— అస్మత్ బేగుగారు! వందనంబులు. మీరేల చింతించెదరు? ఆముల్లామీకుఁ బెండ్లిచేయఁడాయెను. వాని యబ్బనేను జేసెద. నాకెవరడ్డుపడెదరో చూచెద. మీరు చక్కఁగాఁ గూర్చుండుఁడి (అనుచు నిలిచి యేమేమో గొణుగుచు) ఏమండీ శుభముహూర్తంబున గుడ్లగూబలు గూసెను వింటిరా? అవశకునమిది.

అస్మబేగ:— ఛీ ఛీ! ఇట్టిగుడ్లగూబల యఱపులా నా సుఖకంటకములు? వానిని సరకుసేయకుము. మంత్రములు రాకున్నను దంత్రముల వలుకులు గట్టిగఁబలికి పెండ్లిగానిమ్ము. (ఏమో రెండు మంత్రములు లోఁగావినఁబడులాగున యుచ్చరింపుమని చెవులోఁబలుకును.)

అబూకర్:— (గట్టిగా) నోటికివచ్చిన మాటలన్నియు దీర్ఘముతోఁ బాడును) గృహములోనుండి జోరియా లేదు. జోరియా మాయమాయెను పోయెను. అనియఱతురు.)

అస్మత్ బే:— (ఉలిచ్చపడి) ఏమీ! ఏమీ! ఏమీ! జోరియా పోయెనా? పోయెనా? ఎక్కడికిఁబోయెను? ఎవరువచ్చిరి? (అనుచు ఇంటిలోఁబోయి నలుదిక్కులంజూచి మరలవచ్చి) అయ్యో! నా ప్రాణమా! జోరియా! జోరియా! [అనుచు మరల నలుదిక్కులంజూచి] ఏవరురా ఘటులు! (అనియఱచును కేకలువేయును.)

(ఘటులుండెడు వెంబడి స్త్రీకంఠితో లేచి వత్తురు.)

ఓరీ బందాలులారా! కావలియుండక కంఠపర్యంతము మత్తుగొని నిద్రించితిరా? నా ప్రాణప్రియను పోగొట్టితిరా? (అందరిని చీదన్ని) ఛీ ఛీ. పంచమాధములారా! ఆ మత్తకాశినిని నిర్బంధించి మీరు తెచ్చితేనిగాని మీ మస్తకలు నా కత్తికి ఆహుతియౌను. వెళ్లుడి. ఇచట నిలువకుడు. (అందరు నిష్క్రమింతురు) (రఘునాథుని జూచి) ఈ సేవకులు మత్తిల్లియుండుటను యిసుమంతయు ఎరుగను వారి వలన జరిగెను. పోయిచూడుము (నిష్క్రమించును)

రఘునా:— (స్వగతము) నీ కింతటివానికీ యిట్టిచుట్టరికము బలాత్కరించు వాడను ఆక్కరుండునని పెట్టుకొని నే నిపుడు ఎక్కితిని. నాగుట్టు బయల్పడెను. ఇక నెట్టియుక్తులు పన్నుదునో! ముల్లు పామాయెనుగదా? రాత్రి గారికి తెలిపి నన్నే ప్రాణహత్యలపాలు చేయునో? ఏమి సేయుదు? దారిద్ర్యము దుఃఖభాజనము. దుష్టకార్యములకు దారిజూపు చుండును. ఇంతటి పనిపూని నిష్ఫలుండైన నీవేమయినను చెప్పునో? తప్పి పంపునో? ఆశలుడి పాపాలైనని. కంటికి జెడిన రేండనైతిని. దుస్సాంగత్యఫల మిప్పు డనుభవమునకు వచ్చె. "వాసనాత్క్రియ లేకాస్మి రుపద్భోను భూనుతే" యనునది తప్పునా? చేసినతప్పు చక్కపెట్టుకొనకలేను గదా? మెల్లన ముల్లు ననుసరించెద.

(అస్మాన్ బేగం ప్రవేశించి యున్నట్టుండగా దిరుగుచు.)

ఆస్మాన:— హా! జోరియా! జోరియా! ఇంకెక్కడి జోరియా? పోయెను. రంగానాయకుని చండాలుని యాధీనంబాయెను. అయ్యో! చేకడివాదవ్వె. పలవేసిగాలిపట్టినట్లాయె (పండ్లు గొఱుకుచు) ఆపాపాత్ముని కృత్యంబిది. వాడు నాచేజిక్కియుండెనా గండలు చెక్కియుండనా? ఇపుడేమనుకొని యేమి ప్రయోజనము? హా హా! జోరియా! జోరియా! నిన్ను వదులుట నాప్రాణమువదలుటయేగదా? నీవియోగంబు నా కనలసంయోగంబేకదా? హా హా! ఇక నేనెటులనుదు? చిలుక బూరుగపంటికాశించినట్లాయెను. నేనొకటిదలంచితి. దైవంబువేరొకటితలంచె. ఏమందును? దీనికి ప్రతిక్రియ నొనర్పవలెను. (ఆలోచించి) (రఘునాథుంజూచి) రఘునాథా! నీవు వెళ్లుము. మరల నేఁ బిలిపించినపుడు రమ్ము.

రఘునా:— నా రు రు రు పాయ యలు.

అస్మాన:—హు హు! వెళ్లిపాయలు. మంచిది పొమ్ము.

రఘు నా:—మంచిదండి. మీకిపుడు మనస్సమాధానంబు లేదు. పోయివచ్చెద.

[ఏమేమోగొణుగుచు నిష్క్రమించును.]

ఆస్మాన:— [స్వ॥గ] [ఆలోచననభినయించి] చోరాగ్రేసరుండైన కల్లూనాయకునకు రంగానాయకునకు జాతిద్వేషము. కల్లూనాయకుని చౌర్యాదిక్రూర కృత్యంబులకు సర్వాధికారంబునిచ్చి జోరియాను దెప్పించెద [అనుచు జాబువ్రాయుట నభినయించి అల్లీయన యజమనుని సేవకుండు వచ్చును వానింజూచి ] నీవీజాబు రహస్యముగానుంచికొని వాయువేగమనోవేగమునంజని కల్లూనాయకునకిమ్ము.

అల్లీ:— చిత్తము. (అనుచు జాబందికొని నిష్క్రమించును.)

[నిష్క్రమము]

శ్రీ

# చాందుబీచరిత్రము.

తురీయాంకము — ప్రథమరంగము.

సుల్తానా చాందుబీ - కిరీటఖాను - యక్లాసుఖాన్ - అభంగఖాన్ - ఆల్మేడ - హుమాయూనుఖాన్ - మీరుసాహెబు - మోహనఖాన్,

మొదలగువారు.

చాందుబీ:--మ. విననడీ! కాలవిపర్యయంబున మహావిశ్వాసము ల్బాయుచున్
మనపాప్యంబునఁ బెద్దలై [illegible] గుటుల్ మంత్రాదికార్యంబులన్
మన మెప్పట్టిగఁ దీర్పుచుండ్ ఘనులు [illegible] ప్రతిలాభలోఁ; రాజా
జనలున్ దల్పమిఁ గాంక్షభోగములన రాజద్రోహులౌ దుష్టులన్.

ప్రియసోదరులారా! దైవానుగ్రహంబునఁ బుట్టిపెరిగి నశ్యమగదా మీరాజు. మీ దేహబల బుద్ధిబలములుగదా యీపంథానమునకుఁ జెట్టి కోటలుగా నిలిపి రాజ్యమును రక్షించునవి? మానుండికలకాలంబు సకలసంపదలంది యింకగలోకనంబు మాడ్కి మాకు నీడుదలఁచిన మాహాత్మ్యం డిష్ణులముల్కి వడిన యుపాయమెన్నటికైనఁ దొలంగునే? వప్రముఖద్వారంబునఁ గట్టఁబడి వాని శిరముఁ జూచినవారంతట వానిందిట్టకుందురే? వానిఁబొందిన దుష్కీర్తిమనరాజ్యంబున మసలనీవలెఁ బొందకని దైవమును భజించెద.

కురీణయు:--తల్లీ! అకలంకంబగు నీయూర్తికరె నీ నీతివధావలంబన నిభిగౌరవయూ పశ్చాత్తాపబుద్ధి యీ మొదలగు నిర్మల గుణంబులు నినుఁబొందియుండ రాజద్రోహుల వంచనలు నిన్నేమిసేయును? రాజద్రోహమను దావాగ్ని నీసుగుణ శీతలవారిచే నివారింపఁబడుగాక. దుష్టాత్ముల దుష్కృత్యఫలంబు చిరకాలంబు వారేయనుభవింతురు. క్రూరాత్ముల ద్రోహాలోచన లిట్లు దపుడీరీతి వెలిపడుటయరాజ్యమునకు క్షేమము. గర్భస్థమగు జ్వరాంకురము వెలివడినఁగదా మనుజుఁడు తగినయౌషధ సేవనచేఁ దన్నాశనంబునకుఁ బ్రయత్నించును? అటుగాక యంత రించెనేని దేహక్షయముగదా ఫలము? దేహమందలి చెమరక్తము స్ఫోటకరూపమున బహిర్గతమైనఁగదా దేహమునకు నారోగ్యము? దేశమును దేహముంబలె నంగాంగరక్షితముగదా?

యగ్గీజు:— తల్లీ! దేవతలున్నఁ బిశాచములు లేకయుండునా? వాదయుండినవెలివాద లేకయుండునా? కీడుమేలులు రెండును దైవసంకల్పజనితములేమ. చందనవనమున్నచోటఁ గంటకబృందముండదా? జనులలో నొకనికి మోదానుభవము మఱియొకనికి ఖేదానుభవము. చంచరీకము

పూవ్రులుగోరును వంచకము శవముఁగోరును. ఈపాపికలి కాలంబునఁ గీడాదరించువారనే కులు. నరకమునకు నవద్వారములు నాకమునకొకటియ కీడుచేసినవాఁడు మేలుఫలమంద నేరఁడు. అరఁగదచేయుక్కు గుండు మ్రింగిన నఱఁగునా?

ఉ. కీడు వలంచువాఁడెప్పుడుఁ గిల్బిష కీలల మానసంబునన్
గాడునవంగఁ జేసికొని కష్టములందుచుఁ గుందు, వానికిన్
జాడ్యగఁ బాతకంబనుచుఁ జూడకు పుణ్యులు నామమైన నో
రాడఁగఁ జేయ రాయధముఁడాయువునుండిన లేనివాఁడుగా.

తల్లీ! ఇట్టిరాజద్రోహుల నామంబు నుడువనేల? కార్యభాగంబు విచారించికొందము.

చాందుబీ:— నిజము నిజము. ఇస్మాయిల్ మరణానంతరము వానితండ్రి "బూరన్" గారధికసేనతో యుద్ధంబునకువచ్చు సన్నాహంబున నున్నారని నిన్ననే మనరాజుగారు జాబువ్రాసినారు. మనసేనయత్యల్పముగనున్నదఁట. ఇచటనుండి సేనఁబంపునటులయానతిచ్చినారు. సేనసిద్ధముగనున్నయది. సేనాధ్యక్షునిగ నెవనిఁబంపవలెనను విషయ మిప్పుడు విచారణీయము.

యక్లీజ:— తల్లీ! యీవిషయంబున నాలోచనయేమి? హొహుఁడాబిస్సుఖాన్ యున్నవాఁడుగదా? వానింబంప సందియంబేమి? (పూర్వభాగమునవున్న యాబ్సినియన్ సేన లేచి! కూడదు కూడదు రాజద్రోహివాఁడు. దండనార్హుఁడు. హంతకుఁడు అనుచుండ యూఖూట్ ఖాన్ చాందుబీ సింహాసనము సరసుఁజేరి.)

యాఖాన్:- తల్లీ! ఇదిగో నామనవి (అనుచు లేఖనందించుచుండ)

హైఖాన్:- ఏదీ! అజాబిటుదెమ్ము. దూరమున నిలువుము. సంస్థాన మానమర్యాదలు నీకుండెనా యువా?

యాఖాన్:- ఉండవయ్యా! కొత్వాల్! సంస్థానమర్యాదలు నీకంటెను నాకు బాగుగఁదెలియును. ఈ లేఖను మనతల్లిగారేయందవలెను. మీకెవరికి నధికారంబులేదు.

హైఖాన్:- (కోపమున) నీవిట్టియధిక ప్రసంగముసేసితివేని నిచటినుండి గెంటించెద.

యాఖాన్:- ఏమీ! చేతఁగత్తియున్న అబ్సీనియన్ భటుఁడెవ్వఁడు నీకు వెఱవఁడు.

చాందుబీ:—(యాఖూటునుజూచి) యాఖూట్! నెమ్మదిగామాటలాడుము. వాయెమటనా మీపోట్లాటలు? మీమీవాక్పారుష్యంబులు? (హైయాత్ ఖానుంజూచి) ఏమీ! నాబహిఃప్రాణంబులుగనుండు నాసేవకుల లేఖలు నేనందఁగూడదా? ఇట్టితుచ్ఛవిషయంబున నిచ్ఛయించు మర్యాదస్థాయిగా నిలుదునా? (యాఖూటునుజూచి) ఏదీ నీలేఖఁదెమ్ము?

యాఖాన్:-(లేఖనందించి) తల్లీ! న్యాయపరిపాలన నపేక్షించెద. న్యాయమిచట దొరకదేని న్యాయమునందుదారి నేనేయరిసెద.

చాందుబీ:—యాఖూట్! నీవిపుడాగ్రహావిష్టుండగుటచే విగతవివేకత నభినయించుచున్నావు న్యాయపరిశీలనఁజేసెద. నెమ్మదినుండుము. (లేఖను కరీమ్ యుద్దీన్ ఖష్టీవద్దనిచ్చి) మంత్రిగారూ! యీలేఖనుచదువుడు.

కరీమ్:— యుద్దీఖష్టి—(లేఖవిప్పి) ఘనతఁజెందిన సుల్తానా చాందుబీగారిచరణసన్నిధికి సేవకుఁడు యాఖూట్ వినయ విధేయత విన్నవించుమనవి. మాతా! తమయానతి శిరసావహించి

ఇల్లాజాఖాన్, అబీసుఖాన్, యనుసేనానుల క్రింద నుపసేనాధ్యక్షుఁడనై ఖండనంబొనరించు తఱి "అబీసుఖాన్" యనురాజద్రోహి పరరాజపక్షమూనియో యిల్లాజాఖాన్ పైఁ దనకుండు చిరకాలాతిశయాసూయతఁ జేతనో యతనిని నొంటరిగానుండినపుడు పట్టిచంపెను. శత్రురాజ సేన యుద్ధి పైఁబడినప్పుడు పిఱికియై వెఱచిపఱుగిడెను. అట్టితఱి మనసేన వెఱచఱచి పటాపంచలై దిక్కుతోకకు పఱుగిడిరి. మీ సేవకుఁడు ధైర్యమూని ప్రాణంబులైన సరకుసేయక పాఱినసేనను మరలఁగూర్చి పరభటులఁ బ్రాణావశిష్టులఁ జేసివచ్చెను. అట్టిరాజద్రోహిని నీచాధముని మరణార్హుఁగఁ జేయక మన్నించుట రాజమర్యాదకు లోపము.

తమవిధేయుఁడు

యాఖూబ్.

చాందుబీ:- ఏమీ! ఏమీ! తల్లిని పిల్ల, పిల్లనుతల్లి నమ్ముటకష్టమగు కాలమువచ్చెను. శౌర్యమే యుగ్గుగాఁ బెఱిగిన శూరుఁడా భీరుకుఁడయ్యెను? ఉక్కుగుండు మెత్తపడెడి తఱి తటస్థించెను. (అబిస్సుఖానునిఁజూచి) అబిస్సు! నీవు రాజద్రోహివై యీసంస్థానాధిమానిని సేనానినిఁ జంపి కలనుకు వెఱచి కాందిశీకుండవైతివఁట. నిజమేనా?

అ॥ ఖాన్:- (లేచి వందనంబిడి) తల్లీ!

చ. దురమున వెన్నుఁజూపెనను దూషణకు న్గుఱియాయెనె శూరుఁడీ
ధరణిని? నేను నాజివిడి దర్పము దప్పితినన్నఁ బొఱవే
గిరులు నిజస్థలంబులను గీడ్వడి వీడుచు? నింగిక్రుంగదే?
శరనిధు లెండవే? శిఖికి శైత్యముపుట్టదె? వాయువాడునే?

కన్నతల్లీ! అన్నమిడిన యింటికిఁ గన్నమిడఁదలంతునా? ఈ కుటిలపలుకులా ప్రామాణికంబులు? ఇల్లాజాఖానుకు నాపైవైరమెంత యుండెనో నాసేనను నానుండి విడదీసి తన యీటెచే మరణాంతకరమైన పోటుఁబొడిచెను. దానికి సైఁచి నాకరవాలంబున నాద్రోహి శిరంబుఁదఱిగితి. ఇదిగో వానియీటెపోటు! ఈ గాయమునుండి రక్తము ప్రవాహముగ స్రవింప మూర్ఛిల్లితి. నామిత్రుఁడు రంగానాయకుఁడు నన్నెత్తికొనిపోయి జలదుర్గమునకుండు దర్వీషుగారి గృహంబుఁజేర్చెను. అచట దైవానుగ్రహంబున నీపాదరిగారి యౌషదసేవన చేతనో దర్వీషు మనమరాలి మహదుపచార మహిమవల్లనో బ్రతికితిని.

కరీమ్యుద్దీన్‌ఖిష్టి:- ఏమీ! నాస్తికులగు నాజరీన్ జాతివారియౌషదమా నీవు సేవించితివా? వారు గోమాంసమును దినువారు కాదా?

ఆర్మీడా:— (కినుకఁ లేచి) ఏమయా అటుదూషించెదవు? క్రూరమానసంబున దుర్గుణములున్న మీ నాజరీనులు నాస్తికులెటులు?

చాందుబీ:- (సభాస్తారులఁజూచి) ఏమీ! మనమిపుడు మాంససేవనయందుండు గుణాగుణములను జర్చించుటకా యిటు గూడితిమి? వలదీవాదము. (కరీమ్యుద్దీన్‌ఖిష్టిఁజూచి) ఏమండీ! మీరాడినమాటనుండి ఫలమేమి?

సీ. మాంసాశనాది దుర్మార్గసమ్మోదులీ
యవనులంచని ద్విజు లాడరేమి?
మంత్రశుద్ధివిహీన మాంసభక్షకులని
తురకలు శూద్రుల దూరరేమి?
శవమాంసభక్షకోత్సవులని శూద్రులు
పుల్కసులను వెలిబుచ్చరేమి?
మూషకాద్యామిషామోద పుళిందులఁ
గీడించి వెలివారు చూడరేమి!

గీ. మాంసదుర్గణ మాదిని మాటుపఱచి
భక్షణావిధివిధుల సంరక్షణముగ
శుష్కకలహములను బెంచి చూడనగునె?
వలదుసభలోన మతభేదవాద మిఁకను.

ఇట్టి మతభేద వాదములిఁకఁ జాలింపుము. అవి దేశమునకు హితములు కావు. మఱియుత ములుకావు. ( అలిస్సుఖానునుఁ జూచి ) పిమ్మట నీకగతి యేమయినది?

అలిస్సు:— తల్లీ! యీపాదరిగారు పై చికిత్సచే గాయముమాపిరి. కొన్ని దినంబులా యిల్లాజాఖాన్ ఘోరరూపంబు నా కట్టెదుటఁ గట్టినట్టగపడుచుండెను. ఆ మహానుభావులయిన దర్వీషు గారు తమ మహామంత్రబలమున నాకరమునకొక తాయెత్తుగట్టిరి. ఇదిగో యాతాయెత! [ అనుచు విచ్చికంటికి ఒడిచికొని క్రిందనుంచు. )

కులయుమ్‌ఖా:- [ తాయెత విప్పిచూచి ] ఏమీ! ఈతాయెత దేవవిద్య నేర్చిన మహానుభావునిచే వ్రాయఁబడినది. ఇంతటిమహానుభావుండు పూర్వమీ సంస్థానములో సైదాలీ దర్వీషుగారుండిరి. అతివ్యమంత్రము హెూపాసనుండా ఖీమన్వీకారదుండు దత్తుద్వయంబుఁ బిచ్చి రాజాగారిచే బ్రుద్ధంబడి యెచ్చటఁబడిదచ్చెనో? అంతటిమహిమాతిశయుని మనమెచ్చటఁ గనఁగలము?

అలిస్సు:— ఆమహానుభావుఁడే నాకీతాయెతఁ గట్టినది. అక్కపామతి యింటనే నేనుండినది. ఆ యఘవినాశకుని ముద్దులమునమరాతే నాకంతటి యుపచారం బొనరించి శరీరారోగ్యంబు నార్జింపఁ జేసినది. ఆమహానుభావుని యామదపేఁ నాగాయము మాన్పినది.

కుల్సుం:— ఏమీ! సైదాలీ! దర్వీషుగారు జలదుర్గమున నున్నవారా? నా బాల్యమిత్రులుగదా వారు? అకటకటా! వారెట్టికష్టము లనుభవించిరి?

సుల్తానా:— అట్టిమహానుభావులు మాసంస్థానమునకు దూరమై యుండు టేమి? వారిని విచటికిం బంపు లాగు జాబు వ్రాయుఁడు. (యాఖూటునుజూచి) యాఖూట్! ఈనేరం బాలిస్‌ఖాన్ చేసి నారుమటకు సాక్షులున్నారా?

యాఖూట్:— ఉన్నారు. ఉన్నారు. పూర్వదిశ్యాగమునను తమసేవకులందఱు సాక్షులు.

సుల్తానా:— (అలిస్‌ఖాన్ జూచి) అలిస్సుఖాన్! నీపరము సాక్షులున్నవారా?

అలిస్‌ఖాన్:— తాతా! నాపరంసాక్షిగా రంగానాయకుఁడొకఁడపుడుండెను. వెల్లవారి కృత్యంబులు తెల్లంబుగాఁ జూచు దైవంబొకఁడెల్ల సమయంబుల నెల్లెదల నున్నవాఁడు. చరణా

లాను గతంబును శూరధర్మంబునుగను ద్వంద్వయుద్ధంబున న్యాయాన్యాయంబులు ధీమా

నులకు దైవంబు గనుపఱచుచుండును. శూరవృత్తికి హితమార్గంబు ద్వంద్వయుద్ధంబు.

కరీమ్:— ఇదియ దైవసమ్మతము. మతసమ్మతము. శాస్త్రసమ్మతము. కావున నిది యవలంబ్యాచరణీ

యంబు రాజస్థానమున దేవతాసాన్నిధ్యముండును.

యక్లీజు:— ఇదియే సభాస్తారులకు సమ్మతము.

యాఖూట్:-అబిస్సుఖాన్ రాజద్రోహి కావునసీచుఁడు సరి కానివానితో ద్వంద్వయుద్ధంబుఁగూడదు.

(సేనలేచి సిగ్గుల చేటు సిగ్గులచేటని కేకలువేయును.)

అబిస్సు:— (యాఖూటునుఁజూచి.)

మ. తగునే? యో యధమాధమా! వెలచి స్వీధైర్యంబుఁబోనాడి మే
లగు శౌరత్వము వీటిఁబుచ్చి మతమర్యాదల్గన స్వీడుచున్
మగువన్ బోలుచు మాటలాడెదవు ఛీ! మాన్యంబె? యీరీతి నీ
కగునే? రమ్మి కృపాణమున్గనుము దేహంబంట సోకించెదన్.

ఓరీ! నీవు పౌరుషాధికుఁడవేని శూరజన్మంబున జన్మించితివేని న్యాయాభిమానివేని యిదిగో

నినుఁదాఁకెడు నాకరవాలధారకు బదులిడుము (అనుచుఁ గత్తిగొనఁదగిలించును.)

యాఖూట్:-(మండిపడి.)

ఉ. కావర మేలరా? కనర! కండ్లను నెక్కిన క్రొవ్వుఁ దించెదన్
జావునకాయతంబగుచుఁ జక్కఁగనిల్వర! నీదు పెద్దలన్
భావమునన్ స్మరించి హిత బంధుల నిప్పుడె చూచిరార! నీ
వీ వసుధాతలంబిఁక మఱెన్నఁడు గాంచ నటంచు నెన్నరా.

ఓరీ! రాజద్రోహీ! ఇంతకావరమా? మందిడిన కాలు వెనుకకుంధీయుదు. ఈముష్టి ఘాతం

బోర్చినంగదా నీవుబ్రదుకుటకు? (అనుచుముష్టిచే నౌదప్పెఁదన్నును.)

అబిస్సు:— ఇదిగో బదులుకు బదులు! ముష్టికిముష్టి. [అనుచుఁదన్న యాఖూట్ క్రిందపడును] ఓరీ!

దురభిమానీ! దుర్గర్వీ! ఒక దెబ్బకునోపనివాఁడవు నీవాకూఁతఁదక్కరే నాతో మార్కొను

టీరుఁదవు? నీవాలుక యిప్పుడు తెగఁగోయుదునా?

హైదరాలీ:—[లేచి] అబిస్ఖాన్! నీదెబ్బ వెంబడిని వానిప్రాణంబుపోయినది. దైవంబు నీకు సాహా

య్యుఁడై యున్నవాఁడు. న్యాయము నీయందున్నది. నీ వు నేరరహితుండవని మల్తానా

చాందుబీ రాణీగారు నిర్ధరింతురు. [క్రిందపడిన యాఖూట్ నుజూచి] (స్వగత) వీనిప్రక్కన

నొకమూటయున్నది. దానిని వశపఱచికొని వీనినౌత్తించెద (అనుచు మూట వశపఱచు

కొని భటులను విలువఁగొందఱువత్తురు. వారింజూచి) వీనిం గొనిపొండు.

భటులు (చిత్తమనుచు వానినిమోసికొని పోదురు.)

హైదరా:—తల్లీ! ఈద్రోహి సరస నొక కాయితములు మూటదొరికెను. ఇచటనుంచెదను (అనుచు

మూటసింహాసనము వద్దనుంచును.)

చాందుబీ:—[కార్యదర్శి దిక్కుఁజూచి] వెంటనే కాగితములను చదువుము.

వెంకోజి:—[ప్రారంభమున డాన్ డియాగో యిన్నూలుముల్కు పేర వ్రాసినజాబు చదువును] [ఈజాబు ప్రథమాంక ప్రథమరంగమునందున్నది. దానిం జదువవలెను.]

సుల్తానా:—ఏమీ! ఈ డాన్ డియాగో యెవ్వఁడు?

ఆల్మేడా:—తల్లీ! అతఁడు ముదగల్లులోనుండు పాదరి. నాపైనధికారిగానుండి నాకెన్నియో యపకృతులొనర్చె. నాసోదరి మేరీ మానభంగమునకుఁ బ్రయత్నించె. ముదగల్లు నవాబుగారి కృపచే నీసాన్నిధ్యంబుఁ జేరి బ్రతికినారము. ముందు మాగతి యేమో?

రాణి:— పాదరీగారూ! మీరు భయపడవలదు. దిల్వారుఖాన్ గారు మీవిషయమునఁ జక్కగా వ్రాసినారు. విచారణకు మీరు గోవాకుఁబోవుతఱిఁ గాగిదములన్నియును బంపెదము. [కార్యదర్శిం జూచి] రెండవ కాయిదముఁ జదువుము.

ప్రియసోదరుఁడగు యిన్నూలుముల్కుకు వందనంబు లాచరించి జలదుర్గం నవాబు అస్మన్ బేగు వ్రాసినజాబు.

సోదరా! మనమిత్రుఁడగు యాఖూట్ ఖాన్ వెంట మీరుపంపినజాబందితి. ఇటీవల నేను ముదగల్లునుంబోయి రహస్యముగా డాన్ డియాగోయను పాదరితో మాటలాడితిని. గోవాయధికారుల తోడ్పాటు దుర్లభము. ధార్వాడ రాష్ట్రంబును నాలుగులక్షల దీనారములు నిచ్చినచో నాలుగువందల భటులతోవచ్చి రాణీగారినింజంపి బీజాపూరు వశపఱచి, కొను విషయమునఁ దనయావచ్ఛక్తి వినియోగపఱచెదనని యతఁడు వాగ్దానమిచ్చినాడు. ఇతఁడు కడుధైర్యశాలి పరాక్రమవంతుఁడు. కోటలకు సురంగమువేసి బ్రద్దలుచేయు విద్యలో దక్షుఁడు. ఇతనిక్రిందనుండు పాదరి "ఆల్మేడా" పిఱికి. వీరిరువురకుఁ బరస్పరవైరము ఆ యాల్మేడాపై నెద్దియో యొక దోషమారోపించి గోవా యధికారులకు వ్రాసినాడఁట. ఇతని సాహాయ్య మవశ్యాపేక్షణీయంబు. మనరాజు తనతమ్ముని ప్రతిగాఁజూచు "అబిస్ ఖాన్" యీప్రాంత్యమందుఁదనసేనతో విడిసియున్నవాఁడు వానిసేననుండి యనేక భటులకు భూద్రవ్యాది యాశలుగొలిపి విడదీసియున్నవాఁడను. వాఁడుశూరుఁడు గాన నేము రించి తుదముట్టింపవలెను. అహమన్నగరుసేన వచ్చినతోడన జలదుర్గముకోట నిరాటంకముగా వారి స్వాధీనపఱచెదను. బీదూరు గుంపు మనపక్షమవలంబింపను రంగానాయకుఁ డాబిస్ఖానుకు ప్రాణమిత్రుఁడుగా నున్నవాఁడు. మనము బన్నిన యితివృత్తమునకుఁ బోర్చుగీసువారి సాహాయ్యమత్యవశ్యము.

జలదుర్గము.

తమమిత్రుఁడు,

అస్మన్ బేగు.

[ఆసనమునుండి యొక్కతూరిగ లేచి] ద్రోహము. రాజద్రోహము. మిత్రద్రోహము. అస్మన్ బేగు శిరఃఖండనంబు సేయవలయును. మాతా! సెలవిమ్ము.

భటుఁడొకఁడు:—క. తలనఱకెద గొఱియం బలె

మఱియొకఁడు:— నిలువెల్లన్ గ్రుచ్చి యుప్పు నించెద

వేరొకఁడు:— వహ్ని జ్వాలనంబుల నేఁ గాల్చెద

నాల్గవవాఁడు:— నలియఁగ నున్మ్ఱెదను వాని నరములనెల్లన్.

సుల్తానా:— భటులారా! శాంతము. శాంతము. మీరంతటిపనిఁ జేయఁదగిన పరాక్రమవంతులే యగుదురు. విచారింపక నిర్ణయముఁ జేయఁదగదు. [అనుచు సభ్యులంగని] సోదరులారా! జాబు వింటిరి కదా? అంతచ్ఛిద్రంబులెన్ని యుప్పతిలెనో చూడుఁడి? రాజద్రోహులెందఱు వెలివడిరో గనుఁడి? నాపుత్రునకుఁ బరమమిత్రుఁడై అబిస్ఖాన్ కు బంధువై చిన్నతనమునుండి నామన్ననలందిన అస్మక్ బేగుకీ ద్రోహతలంపేల కలిగియుండును?

యఖ్లాస్ ఖాన్:—

ఉ. కారణమేమిగావలయుఁ? గల్మషచిత్తుల మానసంబునన్
భూరిగ నీర్ష్యయ న్గుటిల భూత మనారతమూని యన్యులన్
వారకనేఁచు నెత్తఱిని వారక మౌషధమెందుఁ గానమీ
ధారణి దుష్టఖండనమె దానిఁదొలంచెడు దివ్యమంత్రమౌ.

తల్లీ! పరోత్కర్షాసహిష్ణుతయను పెనుభూతము కలుషాత్ముల మానసంబునంబుట్టి శ్రేయస్కాములనెల్ల నేఁచుచుండును. తదావేశచిత్తులు పంచమహాపాతకంబులునైనం జేయ వెఱవరు. పరద్రవ్యాపహరణము కూటసాక్ష్యము వారికి నైజగుణంబులు. అన్యులఋజుమార్గ ప్రవర్తన వారికి విష సేవనము. ఎంతటిపుణ్యవంతునైన నొప్పింప వారు వెనుదీయరు. అట్టివారినింబట్టి తలఁగొట్టి భూభారంబుదించుట భూభర్తల ధర్మంబు కావున రాజద్రోహియగు నాస్మక్ బేగుకు మరణశిక్ష విధించుటయే ప్రకృత కర్తవ్యంబు. పల్లినపల్లు వెల్వరించుటయె క్షేమము.

చాందుబీ:— సోదరా! నీవు నిజముపచించితివి. అయినను వానింబిలిపించి విచారింపక నిర్ణయముఁ జేయరాదుగదా? (మీరు కాశీమల్లీదిక్కుంజూచి) మీరుకాశీమల్లీ! నిన్ను జలదుర్గము నకాబు పనికినియమించినాను. నీవు సేనాసహాయమున జలదుర్గమునకుంబోయి అస్మక్ బేగునుబట్టి వానివద్దనుండు కాయిదపత్రములు స్వాధీనపఱచికొని మావద్దకుంబంపుము. వానిదుర్నడత విషయంబున నెట్టిసాక్ష్యము దొరకినను విచారణకాలమునందు మాయెదుటనుండులాగు సిద్ధపఱచుము. రాజభక్తిమెఱవక జనుల యనురాగమార్జించి యధికారగౌరవము గాపాడుము. ఈరాత్రివి బయలుదేరిపొమ్ము.

మీరుకా:— తమయానతి శిరసావహించి యొనర్చెద. సెలవిచ్చినఁ బోయివచ్చెద.

చాందుబీ:— [కార్యదర్శింజూచి] అధికారనియామకోత్తరము వ్రాసి త్వరలోఁ దెమ్ము. కర్తవ్యాంతరము మఱేమియు నిపుడులేదుగదా? అబిస్ఖానును సేనాధ్యక్షునిగాఁ బంపువిషయంబు నైన్ను దిగ నాలోచించెద.

కార్యదర్శి:- తల్లీ! అటులయిన నిపుడుచేయఁదగినది మఱేమియు లేదు.

[నేఁటికార్యము పూర్ణమాయెనని యరచును.]

అందఱులేచి రాణికివందనంబులిడి నిష్క్రమింతురు.

(నిష్క్రమణము.)

# ద్వితీయరంగము.

అరణ్యము. కైభావి.

కుల్లూనాయకజట్టి (దొంగలగురువు) - యల్లానాయక - అమీరునాయిక

జోడునాయక - రామానాయక - కుప్పూనాయిక, (దొంగలు)

కల్లుముంతకుఁ బ్రదక్షిణ చేయుదు

అందఱు:—సీ. ఆదయామాయుఁడెపో యాదటనీదులఁ
బ్రోదఁగనవిమా ప్రసాదమయ్యె

[కుండకునమస్కరింతురు]

కల్లులేకయగదా యల్ల నాకంబున
తెల్లఁకంబగుసుధ చెల్లెఁగడిగ

(అనుచుఁ ద్రావుదురు.)

యల్లానాయక:—కనర! ముజ్జగములు మనకుఁగట్టెదుటను
గనబడుమదిర సేవనమువలన

(గిరగిరఁదిరిగి క్రిందఁబడును)

ఆమీరునాయక:—ధగధగమను కాంతి గగనముగప్పిన
జిగిజిగిమణులు నే నెగసి తెత్తు

(పైకినెగిరి క్రిందికిఁబడును)

జోడునాయక:—ఎన్ని యోతలల పామున్నదిలోపల
చిన్నవానికిఁ దెచ్చి యన్న యిత్తు

( నేలఁద్రవ్వును. )

రామానాయక:-- ఎనిమిదిదిక్కుల నేనుఁగలున్నవి
యబ్బబ్బవాని మా యబ్బకిత్తు

( వరుగిడిపోయి గొఱకనిఁబట్టును. )

కుప్పూనాయక:—అసవరుచిఁగోరి యాసురలెల్లను
యీసునవచ్చిరి మోసమాయె

యల్లానాయక:-గీ. కడవదాఁచుడి మఱువక గుడిసె వెనుక

అమీరునాయిక:-- కట్టికొట్టెద వానినేఁ బట్టితెచ్చి

జోడునాయక— నిట్టనిల్వునఁ జీల్చెద నిప్పిలేని

రామానాయక:-- పొట్ట బరువాయె వానినేఁబట్టలేను.

[అందఱు సందడి చేయుచుందురు.]

( కుల్లానాయకుఁడు ప్రవేశించును. )

కుల్లా॥ నా॥:- ఏమియీగత్తర? అయ్యవారు లేనప్పుడు బడిపిల్లలు చెలరేగినట్లున్నది. తప్పెట్రాయి సంత బజారులవలె సందడిచేయుచున్నారు. తలలువగలుకొట్టుకొనుచున్నారు. ( అందరినిఁ జూచి ) ఏమిసందడియిది? చాలుకూర్చుండుఁడి. ( అందఱు గూర్చుందురు. ) వింటిరా నాయకులారా? ఎన్నఁడును లేక యీవాఁడు జలదుర్గమునవాబుగారు నాపేర నొకజాబు పంపినారు! ఏమివింతయిది?

యల్లానాయక:- ఏమిజాబది? ఏమివ్రాసినారు?

కుల్లానాయక:- అందుఁ దేలున్నదో పామున్నదో యెవనికిఁ దెలియును? ఎవఁడు చదువవలెను?

యల్లానాయక:- పాపిముండకొడుకు నాతండ్రి వానకాలములో నన్ను జదువవేసెను. చదువువచ్చినట్టెల్లను నదిప్రవాహమునఁ గొట్టికొనిపోవుచుండెను. వానకాలము పోయెను. అయ్యవారు గుద్దు పెట్టెను. ( రామానాయకుని దిక్కుఁ జూచి ) ఏమోయి నీకేమయినవచ్చునా?

రామానాయక:- నీవుచదివిన బడిలోనే నేఁజదివితిని. చదువుకుఁబోయినదినమే బడ్డిగములోనే మిడత పోటువలె నయ్యవారు నన్నుదన్నెను. నేనయ్యనెత్తికొనిపోయి ముంగ్గపొదలోఁ ద్రోసితిని. చదువు నాకురానిదే మేలాయెను. గుండెకుళ్లులాగు చదివియున్నది పో? గొట్టికొని కూటికిలేక చచ్చువారెందఱు లేరు? మావిద్యసమానము విద్యలేదు. నాకు లెల్లాకల్లు చెట్లెల్లాభంగి యొప్పుగుచేయుదువా? దేవుఁడాయని వేఁడువారికిఁ జదువేల? ( జోడూనాయకునిఁజూచి ) ఏమోయి! నీకేమైనవచ్చునా? నీవు నాయంతేనా?

జోడునాయక:- ఏమయా! ఓనమాలురానిదే కాకాలముద్దిలో గట్టెదూర్చఁగలనా? ( కుప్పానాయకునిఁ జూచి ) ఏమోయి! నీవుగొన్నిదినాలు బడికిఁబోయి యేడ్చితివే? ఆజాబు చదువుము.

కుప్పా॥ నా॥:- ( జాబుబట్టికొని యెగాదిగఁజూచి ) ఏమోయి! నేఁజదివినవి పెద్ద ఓనమాలు. ఇవి చిన్న ఓనమాలుగనున్నయవి. చూచితివా! ఓనమాలలో సైతము కాలము తన మార్పులను చూపినది.

అమీరు నా॥:-- ఇక్కడ లేవయా చూచెద. చిన్నవాఁటినుండి కంటిలోవత్తినిడికొని చదివి యధికారము చేసి యేడ్చి కన్నత్రిప్పటలుఁ బడి మున్నీటిలో చేయిగడిగి తుదకింతకు దిగిన నాకే గొలుసుతురములు గొంతుపట్టుచుండ నైదలోనొక యక్కరము ముక్కయయినను జిక్కని మా కెటులక్కంబగు? ( జాబునందికొని ) " కల్లానాయక జెట్టిగారికి జలదుర్గము నవాబు అస్సలాం బేగు విన్నపములు అయ్యా! జలదుర్గములోనుండు సైదు దర్వేషు కుమారాలు జోరాబీయను సుందరి నాయింటనుండి తప్పించుకొనిపోయినది. అది వైశాలిలోనయినను మఱియెచ్చటనయినను రంగానాయకుని యాధీనములోనో ధర్మానాయకుని వశములోనో యుండును. ఆ సుందరిని నేఁగామించి తెచ్చికొనియుంటిని. వివాహమాడనుండిన రంగా నాయకుఁడెత్తికొనిపోయినాడు. వీగుంపువారింగూడి నీవువల్లెవల్లెలందిరిగి యాతరుణి

రచ్చటనుండినను దాని నిక్కమాడనీక చెక్కుచెమర్పనీక నాకుఁ దెచ్చియిచ్చునది. అక్కర్యము సాహాయ్యముగ నెవఁడేని నడ్డపడిన వానిని సద్దుసేయక చంపవలసినది. ఈకార్యమున నీకేమాట రావరినుండిరానటుల నేఁజేసెద. ఇప్పుడి నాకుగానోసర్చితి వేని బదివేలువరహాలు బహుమానముగనిచ్చెద. ఇంతటినుండి నీయొనర్చు కార్యము లంతెల్ల నీ కేశబద్ధము రాకుండ నే రక్షించెద. ఆలస్య మీవిషయమున విషము. గడియ యొకయుగంబుమాడ్కి నీరాక కెదురుచూచుచుండు మిత్రుఁడు.

జలదుర్గము. అస్మర్బేగు.

కల్లూనా:— (మోసలతదుర్వ్యాకోసుదు నందఱనింటూచి) నాయకులారా! కంటిరేమన ప్రభావము! నవా బింతటివాఁడు మమువేఁడుచున్నాడు. ఈగ నేనుఁగును లోఁగఁజేయుననునదితప్పా?

యల్లానా:— మనవృత్తి యెల్లరు నేకారునట్టిదయా.

రామానా:— కావున నేనే నీవృత్తికిఁ బడితిని.

అమీరునా:— నాయకులారా! మీరుపొరఁబడి మాటలాడుచున్నవారు. మన విద్దెకు గౌరవమున్నచో నవాబిన్నిదినంబు లేల మమునాశ్రయింపఁడాయె? కారణము వేఱు.

జోదునా:— నిజము! ఆఁడుదాని మహిమయిది. కామినీమంత్ర మెందుకట్టైనైన వంచును.

కల్లూనా:— నిజము నిజము. అటులైన నీజాబుఁ బాటింపఁదగినదికాదు. అబలనుఁబట్టి ప్రబలుని పాల్వ అచుట పౌరుషముగాదు. పాడిగాదు...నిలుఁడి నిలుఁడి. తప్పపలికితిని. ఈకార్యమొ నర్చితినేనిలాభములు రెండున్నవి. నవాబుగారి దయయొకటి. ధనలాభమొకటి. అన్నిటికి హెచ్చినలాభము రంగానాయక ధర్మానాయకులపైన మాకుఁగలవైరము సాధించుట. నవాబుమనవాఁడైన మనవేలు పంచు వారెరును లేరుగదా? మనవైరుల నేఁడు భావులనీరు ద్రావింపవచ్చును. రంగానాయకుఁడు శీజాపూరుకు వెళ్ళినాఁడఁట. ధర్మానాయకునిగుంపు స్వల్పముగనుండును.

యల్లానా:— అటులైన మనమిక్కార్యంబు వెంటనే చేయంబూనుదము.

రామానా:— ఆ చిన్నది యెచటనున్నదియో యెవరెఱుంగుదురు?

జోదునా:— వైభావిలోనున్నది. నేనుజూచినాను. కురుక పీరూసాహేబింటఁ బెండ్లిపందిలి వేయఁబోయి యుంటిని. నేఁడే పెండ్లి.

కల్లూనా:— అటులయిన మారొట్టె నేతిలోఁబడినట్టేను. మనవారినందఱిని గుంపుఁజేర్చి రెండుభాగ ములుగ విభజించి యొకగుంపువారు పెండ్లింటిపైఁబడి దోఁచుదము. ధర్మానాయకుని గుంపువారచటికివత్తురు. రెండవగుంపువారా చిన్నదానినెత్తికొని పోవుదము. ఇదిసరికదా?

అందఱు:— సరి సరి. ఇప్పుడే వెళ్లుదము.

కల్లూనా:— మంచిదని వెళ్లుదము.

(నిష్క్రమము.)

# తృతీయరంగము.

## స్థలము, కైబావి.

జోరియా- దర్వీషు- ముల్లాఅల్లీసాబు- భర్మానాయక- భర్మానాయకునిజనులు-
కుల్లూనాయక- అతనిగుంపు- ఊరుజనులు- వెంకోబరావు.

( పీరుసాబు గృహసమీపమునఁ బెండ్లియూరేగింపు మేళతాళములు జరుగుచుండును. మఱియొకభాగమున జోరియ దర్వీషు గూర్చునియుందురు. )

ముల్లాఅల్లీ:--(పీరుసాబునుఁజూచి) ఏమండీ పీరుసాబుగారూ! ప్రొద్దుపోవుచున్నది. ఊరేగింపు ముగియు నంతలో నర్ధరాత్రియగునుగదా! ఆలస్యమేలని త్వరలోలెండు. మెఱవడికానింపు.

పీరుసాబు:--ఆలస్యమేమియును లేదు. లెండి పోదము.

(డీఁ డీఁ అనుచు దొంగలు ప్రవేశించి పెండ్లివారి నందఱిని హింసించుచుందురు.)

కుల్లూనా:—(మఱియొకదిక్కున కుల్లూనాయకుఁడు జోరియానుబట్టి యఱవనటుల నోరుమూసి జోడూనాయకునింజూచి) ఓరీ! ఈముగువను దీసికొని పరుగిడుము. మేమందఱు నిను వెంబడించెదము.

(జోడూనాయకుఁడు జోరియానెత్తుకొనును. భర్మానాయకుఁడు తనగుంపులోఁ బ్రవేశించును. కుల్లూనాయకుని గుంపువారికిని భర్మానాయకుని గుంపువారికినిఁ బోట్లాటజరుగును. భర్మానాయకుఁడు కుల్లూనాయకునిఁ గ్రిందఁగెడపితన్నును. భర్మానాయకునిగుంపు వారు జోడూనాయకుఁడు మొదలుగాఁగల దొంగలనుదోలి జోరియానుదెత్తురు.)

భర్మానా:--(క్రిందపడిన కుల్లూనాయకునింజూచి) ఓరీబందికాండ్రమేటీ! నీప్రతాపంబు నాగ్రామమునఁ జెల్లునని తలంచితివా? రంపుచేసిన గంపతలకెక్కననునది మఱచితివా? పులియున్నచోట నా గొఱియలచరలాటలు? పంచాస్యమెదుటనా వంచకశౌర్యము? ఇది గంపసిడియను కొంటివికాఁబోలు. కాదు కాదు గాలఁపుసిడి. నీకుత్తుక యిపుడు గత్తరించి శక్తికిరక్తబలి యిచ్చెద (అనుచుబాకుఁదీయును.)

కుల్లూనా:--(మోమెత్తి భర్మానాయకునింజూచి) భర్మానాయకా! నీపోటుపాటున నానోట రక్తము వచ్చి ప్రాణములు పోవుచున్నవి. నన్నువదలుము. హాయిగాఁ బ్రాణములు విడిచెద... నాకులవిద్యచౌర్యము. స్త్రీలనెత్తికొనిపోవుటెన్నఁడు నాజాతినీతి కాదు. నీతినీఁగి ప్రాయశ్చిత్త మిపుడాయెను. చెల్లనిమాట చెంపలచేటనునది నిజమయ్యెగా? అయో! ఇదినావని కాదు. ఆనవాబాస్మైబేగు ప్రేరించినది. ఇదిగో యూచాండాలునిజాబు. హెచ్చుమాట లాడఁజాల నన్నువదలుము. నెమ్మదిగఁజచ్చెద.

భర్మానా:--(జాబునంది తనవారింజూచి) భటులారా? వీనినిచటనుండి యెత్తికొనిపొండు.

భటులు:— చిత్తము (ముల్లావాయకుని నెత్తికొని పోదురు.)

ధర్మానా:—(జనులందఱినిఁజూచి) మిత్రులారా! మీరంతయుఁగూర్చుండుఁడి. గంధముతెప్పెను (వెంకోబరావుఁజూచి) వెంకోబరావు! ఇటురమ్ము. ఈజాబుఁ జదువుము.

వెంకోబ:—(జాబునందలి వెనుకటిరంగమున వ్రాసినజాబును జదువును)

ముల్లాఅల్లీ:—[తేది] ఏమి ఏమీ దొంగలి తెచ్చినపిల్లనుఁ బెండ్లిచేసికొను కార్యము నెరవేర్పుటకా యాదురాత్ముండాస్నర్ బేగు నాకింతటిజాబువ్రాసెను? ఔరా మదమహిమ! ఔరా! యధికారగర్వము! ఔరా! ఖలదౌష్ట్యము! విత్తాధికారవయోగర్వము వాని కాపాదమస్తకపూరమైయున్నది. ఇవియన్నియుం మిద్దమీఁది పసువులని తెలియఁజాలఁబోలు.

తే. గీ. గర్వపూరితుఁడధికార కవచధారి
యయినఁ గోఁతికిఁ గల్లు ద్రావి నటులయగును
కలికిఁదోడుగ శనివచ్చి కలసినటుల
యగును మఱివాఁడు కామాంధుఁడయ్యెనేని.

దైవమా! ఇంతటి దోషమునుండి వెలార్చినందులకు నినుఁ బ్రార్థించెద.

ధర్మా నా॥:-ఏమండీ అల్లీసాబుగారూ! ఆనజాబు మీకేమివ్రాసినాఁడు? జాబేదీ?

అల్లీసాబు:- ఇదిగోనయ్యాజాబు ( జాబిచ్చును )

ధర్మా నా॥:-( జాబందికొని వెంకోబరావుంజూచి ) వెంకోబరావు! ఈజాబు చదువుము.

వెంకోబరావు:-- ( జాబంది )

జైఖానాలోనుండు ముల్లాఅల్లీసాబుగారికి వందనంబులు. అయ్యా! ఒక దొరాబీయను కామినికిని నాకును బెండ్లికావలయునని నిర్ధరించుకొన్నాము. ఇచటనుండు ముల్లా నాపై ద్వేషమునుఁబట్టి యధికప్రసంగియై యగౌరవముగమాటలాడి పరిణయకార్యంబు జరపక వెళ్ళిపోయెను. ఈజాబందిన తోడన తమరిచటికి దయచేసివచ్చి శుభకార్యంబు నెరవేర్తురని వేఁడెద. ఇక్కార్యంబొనరించినచో దమయభీష్టంబు పరిపూర్తియగును.

తమవిధేయుఁడు.

జలదుర్గము. అస్నర్ బేగు.

దర్వేషు:— అకటకటా! ఎంతటి దురాచారుండా చాండాలుఁడు?

ఉ. ఎంతటిదౌష్ట్య మెంతయఘ మెంతటి వంచన యెంతద్రోహ మా
వంతయుఁగాని భూతదయ యారయ లేదయెగా? కులాధముం
డెంతటి క్రూరకృత్యముల నేఁ జెడు నంధుఁడునైన నన్నయో?
యింతకునోపినట్టిఖలుఁ డెంతటికైనను జాలఁడేయికన్.

ఆహా! విష్ణుక్రిమిన్యాయమున రాతిలోని కప్పబలె .. బ్రదుకుచున్నవారికేనాయిన్ని కష్టములు? సమాధిచేరినను శనివదలదనునది నిజముగా. ఖలుఁడీయనసెంతటి కఠినమైన నాచరించును

గదా! దుష్టుఁడ్వాదయుము ఓపాలశాలమున వేల "సర్వాంగందుర్గనేవిమం" యనునదిసార్థకము. 'దైవస్యచిత్రాగతిః' యనుపెద్దలవచన మబద్ధముగునే? హా హా దైవమా! నన్నెన్ని యిడుమలఁగుడుపుచున్న వాఁడవు. ఉత్తమాంగంబున నుత్తమంబైన నయనమ్ములు గ్రుచ్చితివి. సకలసంపదలు వికలంబుచేసితివి. జననభూమి దూరమిడితివి. ప్రాణపదంబైన భార్యను మృత్యువుకు బలియిచ్చితివి. ఏకపుత్రుని స్వర్గంబునఁ జేర్చితివి. వృద్ధాప్యదశలోనుండిన కుటీరమునుండి వెడలించిదేశభ్రష్టునిఁ గావించితివి. ఇన్నివిపత్తులనోర్చియు నొకకునమురాలింగని ప్రాణంబు నిలిపికొనంజూచితి. ఇట్టినిర్భాగ్యునకు నట్టినంతనమేల కలుగనివ్వవలెనని యెంచి కాఁబోలు నాముద్దుబిడ్డకిన్ని సంకటములు ఘటించుచున్నావు? నేనేమని యిఁకఁ బ్రాణంబున బ్రదికియుందును?

జోరియ:—(తాతనుఁజూచి) తాతా! నానుండిగదా నీకిన్ని కష్టంబులుకలిగె.

సీ. తల్లిగర్భముఁజేరి తాతనునంధత
గూర్చిన పలుకాని కొమ్మనేనె
జనియించినపుడె నా జననికి
నాయువు కొఱవడఁజేసిన తెఱవనేనె
పుట్టిననెల మఱిపుట్టకమును పెయా
జనకునిఁజంపిన చాననేనె
ముద్దులఁబెంచిన ముదుసలితాతకు
లేనియాపదఁదెచ్చు లేమనేనె

తే. గీ. పరులకీరీతి నెత్తిటి బాధగలుగఁ
జేయు ననుబోలు పాపికి జీవమేల?
కాకియుంబలె బ్రదికిన గలదె ఫలము?
వలదు జీవము వలదిఁక వసుధనునికి.

తాతా! ఇట్టికష్టజీవిని పాపిష్ఠినినేనున్ననేమి చన్ననేమి?

సర్వసంగంబుఁబరిత్యజించి సర్వసుఖంబులు విడనాడి సర్వులనొకకంటఁజూచి కాలముగడపు నీకు నానుండికదా యింతటిదుఃఖంబులు సమకూరెను? వలదీపాపియునికి.

అల్లీసాబు:—దర్వీషుగారూ! ఏలచింతించుచున్నవారు? వ్యాకులత మానస విషముగదా? అదురాత్ముఁడు నిగ్గి నీల్గుచున్నవాఁడు గావున వాఁడుద్రుగ్గు ననునది నిజము.

ఆ. వె. తగ్గినడుచువాఁడు నిగ్గునీధరలోన
నిగ్గినీల్గువాఁడు తగ్గుఁ దుదకు
తగ్గి జీవనమునఁదనరు ఘటీయంత్ర
మగ్గలముగ నీఁగు నిగ్గిదాని.

(జోరియానుఁజూచి) బిడ్డా! వలదీ ప్రాణోపేక్షపరుష సంభాషణ. ఆ దురాచారుండొన రించిన వంచనయె వాని ప్రాణోన్మూలనమునకు సంచకరువై యుండును.

తే. గీ. పరులఁబడఁద్రోయఁ ద్రవ్విన పల్లమునను
తానె పడునను సామెత తప్పదెందు
దీనిఫలితార్థమెఱుఁగక తెలివిమాలి
ఖలుఁడు నిష్కారణమ్ముగఁ గలఁచుఁబరుల.

తల్లీ! ఈదురాత్మునకు నీవు వెఱవవలదు. మీరిఁక బీజాపూరుచేరి చల్లనితల్లియైన సుల్తానా చాందుబీ గారికి మీ యుదంతంబంతయుఁ దెలిపినచో మేలగును.

భర్మానా:-- దర్వేషుగారూ! మల్లాగారి హితోపదేశంబువింటిరిగదా? మీరీదినంబుననె బీజాపూరుకుఁ బ్రయాణముగండు. మీరక్షకభటుఁడనై నేవెంబడించెద. ఆలీసాబుగారు నచటికివత్తురు. ఇదిమీకుక్షేమమగు.

దర్వేషు:— భర్మానాయకా! నీమాట జవదాఁటను. విపాదేతివృత్తంబున మోదఫలము రానగుఁగదా! నామనమరాలి మానప్రాణములు రక్షించిన యుపకారివి నీవుకావా? మేము నీ యాధీనము.

భర్మా:— ఇపుడే ప్రయాణమయ్యెదము.

(నిష్క్రమము.)

చ తు ర్థ ా ం క ము.

బీజాపూరు.

చాందుబీరాణి - ఆబిస్సుఖాన్ - దర్వేషు - జోరియ - ఖాజీకురీమ్ యద్దీన్ ఖష్టి, యక్లిజుఖాన్ - ఆలీసాబు - హైయాతుఖాన్ - ఆబూకర్ - రంగానాయక, భర్మానాయక - లతీఫా - జోహూర్ - అస్మన్ బేగు - సుల్తానుబేగు-వెంకోబరావు.

సుల్తానా:—సభాస్తారులారా! రాజమంత్రులారా! రాజ్యాధికారులారా! సావధానముగా నాలకింపుడు. ఆబాల్యముగా నాచేఁబోషింపంబడి యధికారగౌరవములనంది జలదుర్గము నవాబుగా నుండిన అస్మన్ బేగు రాజద్రోహమొనరించినాడని మాయెఱుకకు వచ్చినది. సమానోత్తమాధికారుల యెదుట శాస్త్రోక్తముగా వానివిచారించుటకై వాని నిచటికి రప్పించినాము. ఈవిచారణ పట్ట పగలుబహిరంగముగాఁ జేయఁబడును.మీరందఱు చక్కఁగా గమనించి మీ మీ యభిప్రాయములిండు. మీన్యాయాభిప్రాయంబుల కంతరాయములుగా బాంధవ్యస్నేహ దాక్షిణ్యంబులు రానివ్వకుడి. (హైయాల్ ఖానుంజూచి) హైయాల్ ఖాన్! అస్మనబే గును దెచ్చి యిటునిలుపుము.

(హైయాల్ ఖాను అస్మన్ బేగునుబట్టికొని సభయెదుట నిలుపును)

(అస్మన్ బేగునుఁజూచి) ఓరీ! నీవురాజద్రోహ మొనరింపయత్నించితివని మాయెఱుకకు వచ్చినది. నీవా నేరంబొనర్చితివా?

ఆస్మక్ బే:--ఏమీ! నాపైనట్టి దోషంబారోపించిన వారెవరు?

సుల్తానా:—ఓరీ! అబిసీనియన్ సేనాధికారియయిన యాఖూబ్ యనువాని వశమునం గొన్ని జాబులు దొరకినవి. ఆజాబులే నీ నేరస్థాపనకు ముఖ్యాధారములుగా నున్నవి. అవి నీవు వ్రాసినవే నా చూడుము?

( వెంకోబరావా జాబు లాస్మక్ బేగుకిచ్చును. వాఁడు వానిఁ జూచి)

ఆస్మక్ బే:--ఈజాబు లన్నియును నాచే వ్రాయంబడినవేను.

ఖాజీసా:—(సభ్యులంజూచి) సభ్యులారా! ఈ దురాత్ముండు వ్రాసినజాబులన్నియుం జదువ నొకదిన మగును. ముఖ్యమయిన యొకజాబును జదివెదను వినుడి.

[ 3 యంకము మొదటిరంగములోని కాయితముఁ జదువును. ]

[జనులందరు లేచి యీ రాజద్రోహినిఁ జంపవలెను తక్షణమే తలఁగొట్టవలెనని కేకలు వేయుదురు.]

ఆస్మక్ బే:--[ వారినిఁ గోపమునఁ జూచి ] కుక్కలారా! శ్వానకన్యాయమున మొఱిగెదరేల? నా మిత్రులు "ఇన్నాలుముల్క్" "ఇల్లాజుఖాన్" అనువారు జీవితులుగానుండినచో నాజాబులలో వ్రాయఁబడినంతకంటెను హెచ్చుపనిఁ జేయుచుంటిని. కార్యము మీఱిపోయెను. అయినది యయినదేను. కానున్నది నా దురదృష్టఫలము. ఆఁడిముండలబలె మీరేల మొఱిగెదరు?

[ జనులుమరల చంపవలెను తలగొట్టవలెనని కేకలు వేతురు. ]

చాందుబీ:--( జనులంజూచి ) జనులారా! ఇంచుక నెమ్మదించుడి. అవ్యవస్థితచిత్తున కలుకగాక వివేక ముండునా? ప్రాణముపై నిరాశగొనువానికి మానముండునా? ( సభ్యులనుఁజూచి ) సభాస్తారులారా! ఈ దురాత్మునకు విధ్యుక్తమయిన శిక్షయెద్ది?

ఖాజీకురుద్దీన్, "జిఘాంసంతం జిఘాంసీయాత్" అని యున్నది, మరణమే వీనికి దండన.

సభ్యులు:—( అందఱు లేచి ) మరణదండన మరణదండన.

అబిన్సు:— (లేచి) మాతా! వానికి మరణదండన విధింపక మునుపు నామనవి యొకటియున్నది వినుఁడని వేఁడెద. వీఁడు నాకు బంధువు. బాల్యమిత్రుఁడు. చిరకాలమునుండి భయభక్తులచే మిమ్ముఁ గొలిచి యిప్పుడు జరచే గ్రుంగిన మన సుల్తానుబేగుకు నేకపుత్రుండు. ఆ మూడుకాళ్ళ ముదుసలి సందడిలో రాఁజాలక నగరి బహిర్ద్వారంబునఁ దుఃఖించుచున్నవాఁడు. వీఁడొనరించిన ద్రోహం బవాచ్యంబైనను వీని నిప్పటికి మన్నింతురని వేఁడికొనియెద.

చాందుబీ:--(తలయూఁచి అస్మక్ బేగునుఁ జూచి) ఓరీ! తీర్పుఁ జదివెదను వినుము. రాజద్రోహమను నేరంబు నీ వొనరించినటుల స్థిరపడినది. ఇట్టి ద్రోహంబుఁ జేసి రాష్ట్రమునకు నపయశము దెచ్చితివి. జనుల నెమ్మదికి భంగమొనరించితివి. నీయత్నమే ఫలించియుండిన మా ప్రాణంబు లెప్పుడో పోయియుండెను. దైవానుగ్రహంబున నంతటి ముప్పు దప్పెను. నీవు మరణార్హుండవు. అయినను నీ తండ్రి శతవృద్ధుఁ. కులవనోమ్ములన [illegible] పుట్టి

తివి. అందున నేరపుత్రుండవు. నీ మరణంబుచే నతనికి ఘోరవ్యసనంబు సంభవించు. అకా-
రణంబున నీకు మరణదండన విధింపక దేశభ్రష్టునిఁగావింప నాజ్ఞయొసఁగితిమి. ఏకార
ణంబుననైనను నెత్తుటనైన నీవు మా రాష్ట్రములో నెచ్చటనైన నగపడితివేని నిర్విచా
రంబుగ నీ శిరచ్ఛేదనంబొనరింప నా రాష్ట్రపు జనులెల్లరు స్వాతంత్రులై యుందురు.
ఇప్పుడే మాయెదుటనుండి తొలఁగుము.

( అస్మత్ బేగు నిలిచియుండును. )

దర్వీషు:— (జోరియా చెవిని) తాఁజేయువని గంధర్వులు సేసిరనునది నిజమయ్యె. మనమేల వానిపై జేయు నేరంబారోపింపవలెను?

జోరియా:-- వలదు వలదు. వెలిపడుట సిగ్గుల చేటు.

చాందుబీ:--- అస్మత్ బేగ! ఇఁక నిచటనుండి వెడలుము. నిలువవలదు.

అస్మత్ బే:-- తల్లీ! నాకు మరణదండన సుఖమైయుండెను. ప్రాణాధారమయిన దారను నివ్వవేని నాకీ ప్రాణంబే వ్యర్థముగు.

చాందుబీ:— ఓరీ! నీ భార్యయెవరు?

అస్మత్ బేగు:- చం. అదెగను జోరియాయనెడి యమ్మలమిన్న సభాంతరంబునన్
గుదురుగ నమ్ముఁజూచియును గూర్చునియున్నది సిగ్గుమాని; యా
మదవతి నాదుదార వినుమా యతి వేగమె యిమ్మ దానినిన్
చదురున నానియుంబలెను సత్కులమానిని యుంట సాజమే?

ఆ ముదుసలిపెద్ద తద్దయు సిగ్గుమాని ముగ్గులుగులుకుచు గూర్చున్న ముగుదయే నా ముద్దియ. పరస్త్రీ పురుషులున్న సభలకు వచ్చుట సిగ్గులపాలుగాదా? సానులకది చెల్లు.

చాందుబీ:— (కోపమున) ఓరీ ద్రోహీ! అధికప్రసంగము సేయకు. ఆస్థానము దేవతాస్థానముగాదా? ఆ కన్నియ నా మన్ననకుం బాత్రురాలు. నా యానతి భంగి నిచటికివచ్చినది. ఇందే దోషములేదు! ఆ నారి నీ దారయే వా?

అస్మత్ బే:-- (నవ్వి) ఇటుల పలుకుట చోద్యము. ఆ నారి నే మతసమ్మతముగఁ బరిణయమయిన తరుణి. ఇందు సందియంబేమియు లేదు.

చాందుబీ:-- (జోరియా దిక్కుంజూచి) బిడ్డా! జోరియా! వీనిమాట వింటివిగదా? నీవు వానిభార్యవేనా?

జోరియా:-- (కన్నీరుఁగార్చుచు వణకుచుండును.)

దర్వీషు:— తల్లీ! వెఱవకు. సభ్యులందఱు దైవసమానులు. నీపాలి దైవంబీ సుల్తానా చాందుబీ. శుద్ధ చేతస్కులకు భయమేమి? నీయుదంతంబు సర్వంబుఁ దెలుపుము.

చాందుబీ:— అమ్మా! భీతిలనేల? ఉన్నది యున్న తీరునఁబలుకుము.

జోరియా:-- తల్లి [నలుదిక్కులంజూచి]

మ. జననీ! నాదుచరిత్ర దుఃఖకరమీ సభ్యాళికిన్ విన్పఁగా
తనదుష్కీర్తి జగత్ప్రసిద్ధి యగుటల్ దానెంచ కీమూర్ఖుఁడా

రయేచ్చుచుండెను. మరుదినము వీఁడు ముల్లాతోఁబోట్లాడుచుండ రంగానాయకుఁడీ యంగన నెత్తికొనిపోయెను. వీఁడు సర్వస్వము గోలుపోయినవానిబలె రయేడ్చెను.

అస్మత్ బేః—ఛీ నీచుఁడా! నేఁబెట్టిన యన్నము నీకుఁ బందిమాంసమయ్యెఁగా!

చాందుబీః—అస్మత్‌బేగు! వానినిఁదిట్టకుము. ఏమయిన నడుగవలసియుండిన నడుగుము.

అస్మత్ బేః—వీఁడు నాకు స్త్రీలంగాకృ నీచుఁడు. వీనినా నేనడుగునది?

చాందుబీః—(జోరియా దిక్కుఁజూచి) బిడ్డా! లతీఫ నిన్నేమిచేసెను? నీవెటు దప్పించికొంటివి.

జోరియాః—

కం. జననీ! నేనటులుండఁగా నెచటెయెో చాతుర్యముల్ సల్పుచున్
ఘనుఁడా "యాస్మత్‌బేగు" నన్నుఁగరుణన్ గామించె నీభాగ్యమే
మని నేఁబల్కుదునంచు నాడఁగ విషాదాధీననై సుక్కికం
టిని భీమాంబను తాతనున్ దెలుపుమంటిన్ దుఃఖవృత్తాంతమున్.

అస్మత్ బేః—(కోపమునఁ బండ్లుగొఱుకుచు చరణములు నేలకుంజఱచి) హా హా! జగజంతా! చాంఢాలీ! ఛీఛీ! నీకృత్యంబాయిది? నేఁబ్రతికితి నేని నినుఁజంపకమానను.

చాందుబీః—ఓరీ! ప్రేలకు విచారణగానిమ్ము (కొత్వాలుంజూచి) హైయాత్ ఖాన్! ఆ లతీఫాను, పిలి పింపుము.

[హైయాత్ ఖాన్, లతీఫాయని యఱచును. లతీఫా ప్రవేశము. ఖాజీ ప్రమాణము చేయించు.]

చాందుబీః—లతీఫా! నీవు సేయునది సేవకావృత్తి యయినను మానమర్యాదలకే కొఱంతయులేదు. ఉదరపోషణార్థంబు పేదలునీచవృత్తియవలంబించినను వారిహృదయం బేకళంకమునకుఁ జోటివ్వక శుద్ధముగానుండును. కావున నీవు నిజమాడుదువని నమ్మినాను. వీఁడాకన్నెను బెండ్లియాడినవాఁడా! నిజముపలుకుము.

లతీఫాః— (అస్మత్ బేగు దిక్కుఁజూచి) ఏమండీ! నవాబుగారు! స్థానాధికారబలములున్నవని యల్లనాఁడు నాకంఠంబునకు మీకరవారంబెత్తితిరి. ఆకృపాణంబిపుడే మయ్యెను? అంతటి మిడిసిపాటెంతటి వానికైనందగునా? మీపనియిపుడు కప్పతోకకు దిగెనుగదా!

చాందుబీః— లతీఫా! వానితో మాటలాడవలదు. వానిభయమువలదు. ఈకన్నియ విషయంబున నీకేమి దెలియును? యథార్థముగవచింపుము వీరిరువురు భార్యాభర్తలేనా?

లతీఫాః— రామరామ కాదుకాదు! ఈమగువ నాపాగుకుపోతు తగలియైన నెఱుంగఁడు. బలవంతమునఁ బెండ్లియాడ యత్నించెనుగాని దైవానుగ్రహంబున నీముల్లాకు మంచిబుద్ధిపుట్టి వీని దుష్కృత్యము నిష్ఫలమయ్యెను. ఆరాత్రియే మహానుభావుఁడు రంగానాయకుఁడీయువిద నెత్తికొని పోయెను.

చాందుబీః— (అస్మత్ బేగునుఁజూచి) నీవేమయిన నడిగెదవా?

అస్మత్ః—(లతీఫానుఁజూచి) ఓసీ! నీకన్నంబిడినది కుక్కకుఁ బురోడాశమిచ్చినట్లయ్యె. ఇది నా

లంజ. వెలకు దొరకెడియాలు. తన్నుకడిలి యీనారిని బవినయంత్తే తిన్నని యన్యాయము లాడుచున్నయది.

లతీఫా:— నిజము. తనకుగానిది తలారిలంజ. ఓరీ! తెంచినలంటా! నను తెలియదా? గోడుకున్న గాడిద కంటుపడునదని మఱచితివా? ఏమిరూపెదవు? నిర్దయప్రదేశమున బందుర్గము కోట యనుకొంటివియాయిది? ఇచటఁ అల్లనిమాతల్లియున్నది. నీకు వెఱ్ఱవను! దురాత్మా! రఘు నాథుఁడను విప్రుడినోడి వనితావేషంబుదాల్చి ముల్లావద్దనిలువలేదా? ముల్లాకును నీకుఁ దేవదైత్యన్యాయమునఁ గలహము జరుగలేదా! వెంటనే జోగియాపోయునని కేకలువిడవడ లేదా? పెండ్లియెప్పుడాయెను? ఎవరికొంపలు గూల్పఁదలంచితివి? కట్టెవంకర యగ్ని తీర్చు నట్లు నీకాత్మత యిప్పుడుగదా శాంతియగును.

చాందుబీ.- లతీఫా! నీవు వెళ్లుము. ( సఖ్యులంజూచి ) ఇఁక వారు హెచ్చుసాక్ష్యమువలదు. ( అన్వర్ చేగుముఁజూచి ) నీకుఁ బెండ్లిచేయించిన ముల్లాయున్నవాఁడా?

( అబూకర్ అన్వర్ చేగుకుఁ గనుసన్నఁజేయును )

అన్వర్:— ఉన్నాడు. ఇచటనే వచ్చియున్నవాఁడు! అదిగో యతఁడేను (అని అబూకర్‌నుజూపును)

చాందుబీ:- హెూ హెూ వారేనా? ( అబూకర్‌ముఁజూచి ) ఏకుండీఇటురండి ( వచ్చును ) (ఖాజీనిఁ జూచి) ఖాజీగారూ! వీరిని బ్రమాణము చేయించదరా! ( ఖాజీ ప్రమాణము చేయించి )

ఖాజీ:— ( అబూకరునుఁజూచి ) మీపేరేమి?

అబూకర్:- నాపేరాబూకర్.

( ఖాజీ తనశాస్త్రమంతయుం వెదకి రాణిగారింజూచి యీపేరుగలముల్లా మాదేశమునలేడని వచించును )

రాణి:— అయ్యా! మీదేయూరి ముల్లాగారు?

అబూకర్:- తల్లీ! నాది పాంళక్కిపురము.

కార్యదర్శి:- ఏమీ! పాంళక్కిపురమా! అట్టిగ్రామము మారాష్ట్రములోలేదు.

అబూకర్:- మీరాష్ట్రములోనిదని యెవరంటిరి?

చాందుబీ:- మఱియేరాష్ట్రములోనిది?

అబూకర్:- వంచకపంచక రాష్ట్రలోనిది.

చాందుబీ:- ఆరాష్ట్రమెచ్చటయున్నది?

అబూకర్:- పంచబుగాళములో.

ఖాజీ:— ఏమయ్యా! నీవు ముల్లాయెట్లైతివి. ఎవరుచేసిరి?

అబూకర్:- మావంశమే ముల్లావంశము. మాపెద్ద తాత తల్లి పెత్తండ్రితల్లి పెద్దప్పనుండి వంశపారంపర్యగా వచ్చినది.

చాందుబీ:- ఉంచుము. ప్రపంచంబంతయు మనముగనిన్నాళ్లు మాకునుండిరి. [illegible] జూచి యెఱుఁగుదురా?

నిరాకరింపఁజాలం. కావున నీనిందేశభ్రష్టునిఁ గావించితి. ఇదియే నాయాజ్ఞ. [కౌశల్యాలుం జూచి] వీనిని నారాష్ట్రమునుండి వెడలఁద్రోలుఁడు.

కౌశల్యాలు:- [ అస్లుఖానుఁ జేగసుఁబట్టి యీడ్చికొని పోవుచుండ నంమున్న కొందఱునవ్వుచు దురాత్ముఁడకుఁ దగిన శాస్తియయ్యెను దిక్కులేనికన్నె నెర్నినన్నమునుఁ గడిపెను. వీనికి నీతులేని నిట్టివియే గతి యనియాడుదురు]

అస్లుఖా:— [వారింజూచి కినుకతో] అఁడుదానికింలోఁబడిన వెకఁగులారా! దేశభ్రష్టుఁడని తినని నన్నుఁజూచి నవ్వకుఁడి.

శా. మందప్రజ్ఞులు మీరు నన్నుఁగని యీమాడ్కిన్ హసింపంగ నే
నొందన్ దుఃఖము జీవముండినను నెందున్న న్నీడన్మద్దియన్
సందేహంబును లేదు నమ్ముఁడిది మీసల్ దువ్వుచు న్వల్కెదన్
గుంద న్నొందను భీతిడెందమున, మీకున్మృత్యువై యుండెదన్.

హైదరాలీఖాన్:-ఓరీ! ఇదరకు. వ్రల్లదములాడకు. వెళ్లుము వెళ్లుము. [అనుచు నీడ్చికొనిపోవును]

చాందుబీ:- బిడ్డా జోరియా! యిటురమ్ము. నిష్కళంకవతియగు నీయందొక కళంకంబుఁగల్పించి యాతులనావకుఁడు నీమనంబుఁగలఁచెను. పాపాత్ముండు పోవుగలికిందోయెను. వంతలేని సంతసము లేమగదా ? గతమునకుఁజింతించుట మతిమాంద్యత. నీవిఁక నారక్షణయం దుండుము. వెఱవవలదు. నేఁబుత్రసమానునిగాఁ దెంచిన యీఅలీఖానుకు నిన్నిచ్చి లేవటిదినంబున నే పరిణయుంబొనర్చెద.

[సభ్యులందఱు సంతోషము సంతోషము సమ్మతము.]

ఇదిగో! సభాస్తారులందఱు నామాటకు సమ్మతించిరి! నీకును సమ్మతముగదా?

జోరియా:— [ సిగ్గున ]

కం. మాతా! నీయానతికిని
నాతరమే మారువలుక? నాహృదయంబీ
వేతీరునఁ దెలిసితివో?
యాతఁడె నాపాలితల్లి నీవు నిజముగన్.

తల్లీ! సర్వమునకు నీవేస్వతంత్రురాలవు. కావున నన్నెద్దియువిచారింపవలదు. నీయానతిరీతి వర్తించుచుండెద.

భటుఁడు:—[ప్రవేశించి] మాతా! గోలాదొరతనమువారినుండి రాయబారియొకఁడువచ్చి ద్వారమునఁ గాచియున్నవాఁడు. అజ్ఞయయిన విలిచికొనివచ్చెద.

చాందుబీ:— రప్పింపుము.

దూత:— [ ప్రవేశించి రాణికివందనంబులిడి ] తల్లీ! గోవా దొరతనమువారు తమకు నతులిడి యీ జాబునొసంగి నన్నంపిరి. ఇదిగో జాబు (జాబివ్వ రాణిగారందికొని వెంకోజీపండితునికిఁ జదువుమనిఇచ్చును. అతఁడంది చదువనారంభించును.)

వెంకోబా:- సుల్తానాచాందుబీ గారికి. డాంమేథి యాస్తియాబుకర్కూ వందనంబులిడి చేయు విన్నపము. తమకు నవాయిస్నగరాధీశులకును సామంతంబు జరిగి జయలక్ష్మి తమయందు నెలకొనెనని విని హర్షించితిమి. అట్టి యిక్కట్టుకాలంబున రాష్ట్రాధికారులు కొందఱు రాజద్రోహులై రాజవంచనకు లోబడిరని విని మదమందితిమి. మునగల్లులో మాయధికారంబునకు లోబడి యచట మతస్థాపనాచార్యుడుగా నుండిన యాత్మేదాయును పాదరియును వానిసోదరియును రాజద్రోహులకు సాహాయ్యులై యున్న కారణంబున వారిఁ మీరు చెఱఁబట్టి బీజాపూరియందుంచినారనియు యిట్టివారిని విచారించి దండింప యత్నించినారము. కావున మీ దాసులకాత్మల నిచటికిం బంపవలెను.

ఇటుల విన్నవించు

డాంమేథి యాస్తియాబుకర్కూ.

చాందుబీ:-- ఏమీ! ఆత్మేదాగారు రాజద్రోహమొనరించిరా యెట్టిమూర్ఖులయినను దలంతురా? మేరీ దుర్నడతకుఁ గుజరొయెనదని పగవారైనం బలుకనగునా? [ గోవా యధికారింజూచి ] మీదొరతనమువారు పీరివిషయంబునఁ బొరఁబడినారు. ఇచట జరిగిన విషయములంబట్టి చూచ డాండి యాగోయను వాఁడింతటి ద్రోహకార్యంబు లొనరించినట్లు స్పష్టమయ్యెను [వెంకోబా పండితునింగని] వెంకోబా! ఇచటి విచారణలో జరిగినవిషయములనెల్ల స్పష్టముగాఁవ్రాసి డాండియాగో జాబులు గోవా దొరతనమువారికిం బంపుము. [ఆత్మేదానుఁ జూచి] పాదరి గారు! మీరును మీసోదరియును మీయధికారులయొద్దకుఁ బోవచ్చు. ఇచట జరిగిన వృత్తాంతమంతయును దెలిపి మీపరము సాక్ష్యమిచ్చుటకు మాయధికారి యొకఁడు మీ వెంటవచ్చును. అచట మీరు నిర్దోషులని స్థాపించి యందున్నగరున పాశ్చాత్యవర్గముతో సుఖముగానుందురు. [ సభాస్తారులంజూచి ] సభ్యులారా! మీ రాజగారు శీఘ్రమిటఁ జేరుదురు. రాచకార్యములింతటితోడ వారికప్పగింతపెట్టి నేనహమదునగరునకు వెళ్లెదం. (కార్యదర్శింగని) నేఁడొనరింపఁదగిన కార్యంబున్నదియా?

కార్యదర్శి:- తల్లీ! మఱియేమియు లేదు.

( సుల్తానాచాందుబీ సభ్యులు నిష్క్రమింతురు. )

## ద్వితీయ రంగము.

### గోవా, కారాగృహము.

(డియాగో, బలదాసర్.)

డియాగో:-(చెఱలోనుండి స్వగతము.) అకటకటా! కుటిలవర్తనుల బ్రదుకీటులగుట సహజముగదా? వెక్కిరింపఁబోయి మూలకలఁబడినట్టయ్యె. శేలుమూపి వెకలుఁడనైతిని. కామాంధుఁడనై నేఁడలంచినదేమి? కాకు ఫలించినదేమి? ఆ నీలాలకం గూడి లీలాలోలుఁడనై సుఖజలధిలో నోలలాడందలంచి కుటుకకు గాలంబుఁ దెచ్చికొంటిని. రాజ్యంబు నేలఁగోరిన నేను గారాగృహంబునఁగూలితి. అయ్యో! నిష్కళంకుని నిరపరాధుని నిష్కారణముగ నేఁచిన పాపాత్మునకుఁదైవ మీ ప్రమాదంతన విధించిన ధర్మమేగదా? పరస్త్రీ యోషిద్వృద్ధి నోర్వలేనాఁడు సుఖమూరఁడుగాఁడే? నీనిందలిసియు నటుఁబోలుమూర్ఖులు పరుల బాధింతురు. ఇది ఖలలక్షణము.

కం. సరివారి పరువు సైఁపని
నరుఁడీశ్వర లేవులేక నవయుచుఁగుందున్
ఖరుఁడని ఖలుఁడని దూఱుచు
సరసులు రోయుదురు వాని సరసన్ జనఁగన్.

హా హా! ఇంతటి దుర్యశంబునకు గుఱియయ్యెఁగదా నాబ్రదుకు? గతజలసేతుబంధంబురీతి నిపుడే మనికొనిననేమి ప్రయోజనము? అటులని కారాగృహంబునంజిక్కి కాఁతియలు గుడుచుచు నూరకయుందునా? ఉండక యేమి సేయనగు? కారాగృహవిముక్తుఁడగుట యెటుల? అయితినిబో చెడినపేరు మరలకుదురునా?... ఊ! ఏమి! యిటు లాలోచించెదను? ప్రపంచంబున నందఱు సుగుణసంపన్నులే యున్నవారా? లేరుగదా? మంచివారరుదు. మంచి చెడుంగులు ప్రకృతిజన్యంబులు. మంచివానికి వచ్చులాభమేమి? చెడ్డవానికిఁబోవునదేమి? ఉభయులకును శరీరాయాసఫలముగదా యుదరపోషణసాధనము? శారీరకష్ట ముభయులకు సామాన్యధర్మము. కావున దుర్మార్గుఁడనై మనియెద. హా! ఇందుండి వెలువడు మార్గంబెద్ది? పండక పంటకమునునా? యల్లింపక కార్యమగునా? చిక్కియుగిలించుటకంటె వెళ్ళి వెక్కిరించుట మేలుగదా?

ఉ. కారనుఁజిక్కి కాఁతియలఁగాయము కష్టము నొందుచుండఁగా
వైరులు నన్నుఁగాంచి నగువారుగదా! తగదిట్టియున్కి రే
యీరున నైన జెల్వ్వడి సతిమణి మేరియఁబట్టి కూడెదన్
పౌరుషసాహసాధ్యుఁడని ప్రస్తుతిపాత్రుఁడనై చరించెదన్.

సరి! సరి! ఇటులనే యోచించవలయును. న్యాయాధికారి నామిత్రుఁడు సత్ప్రసంగాచి యుండును. శుక్రాత్రియే వెల్వడి పోనింగూడవలయును. కాదేని నారాక నిరీక్షించి విరాఁకెయ్యడై నామిత్రుఁడు వెడలిపోవును. నేఁడే విచారణముగించి యధికారులు నన్ను గారఁబడ

ద్రోయుదురని యెవరెఱుంగుదురు? విచారణకాలమునందుఁ దప్పించికొనుపోను నేఁజేసిన యత్నము నిష్ఫలమయ్యె. మంచిది. ఇప్పుడేమికొదవయయ్యె? నాబావగదా రెండవ జామున నీకారాగృహ రక్షణాధికారిగా వచ్చును? అపుడించుక నాబుద్ధిలాఘవముఁ జూపెద. ఇపుడెంతప్రొద్దైనది? తొమ్మిదిఘంటలుగదా? ఇఁక నతఁడు వచ్చుననితోఁచును. మంచిది రానిమ్ము.

[ బలదాసర్ ప్రవేశము. ]

బలదాసర్:- నాయనా! డియాగో! ఎంతకష్టంబనుభవింపవలసివచ్చెను? నీ సోదరి నీకై పడువ్యసనం బపరిమితంబుగదా? విచారణాధ్యక్షులకు లంచము లిచ్చియయినను వారిని మనదారికిం ద్రిప్పను నేఁ బడినపాటంతయును వ్యర్థమయ్యెను. ఏమి సేయుదును?

డియాగో- ( కారాగృహములోనుండి ) బావా! నాప్రాప్తియిటులుండ నెవరేమియొనఁగించిన నేమి ఫలము! బావా! అమానుషముగా మనుటకంటెను మరణమే మేలని తోఁచెడు; అందులకు నేసిద్ధపడియున్నాడను. అయ్యో! ఎంతకష్టపడి ధనమార్జించితిని? కుదకదినాసోపరికైన ననుభవింపను లేదాయెఁగా? నేలపాలయి పోయెనుగదా?

బలదాసర్:-డియాగో! అంతటి ధనమారీతిఁ గోలుపోవుట మేలుగాదు. ఎచటదాఁచితివి?

డియాగో:-బావా! ముదగల్లులో నొకరహస్య ప్రదేశమునందు పాతినాను. ఇతరుల కగోచరంబది.

బలదాసర్:-డియాగో! దానిందెచ్చు వెరవెద్ది? (ఆలోచన నభినయించి) డియాగో! నీగది గాలిగూడు జూచితివియా? ఒక త్రాడిచ్చినచో దాని సహాయమున గోడమునుక తప్పించికొనిపోయి ద్రవ్యముఁదెచ్చెదవా?

డియాగో:- బావగారూ! మంచియాలోచన వెదకితిరి. నాసామర్థ్యమునకందుండి దుముకుటెంతపని? ఒకవేళ మరల నే దొరికినను మరణదండనకంటెను నాకుఁ గాఁదగిన హెచ్చుశిక్ష లేదుగదా? దైవానుగ్రహంబున ముదగల్లు జేరినచో నాద్రవ్యమంతయుఁ నాసోదరికింజేర్చి మరణశిక్ష సుఖముగా ననుభవింెద.

బలదాసర్:- డియాగో! అటులయిన నీపగ్గమందికొనుము, (అనుచు నొకత్రాడు లోనికివేయును)

డియాగో:-( పగ్గమందికొని యిటులటులం జూచి ) బావగారూ! గాలిగూడు నిండా యెత్తుననున్నది. అందున్న సలాకకు నీపగ్గముగట్టుటెటుల?

బలదాసర్:-డియాగో! నేలోనికి వచ్చినచో నాపై నిలిచి యా యినుపకమ్మ నందెదవా?

డియాగో:- బావగారూ! ప్రయత్నించెద రండి.

బలదాసర్:- వెనుకవాకిలినుండి వచ్చెద ( అనుచు వెళ్లును )

డియాగో:-( స్వగతము ) అంతటి యెత్తునుండి దుమికినచో భూమువారవు మరణము బృహస్పతివారమే సిద్ధించు. మాబావలోనికిరానిమ్ము, వానిపనిముగించి నా తలఁచిన కార్యము నెరవేర్చి కొనిరాబెద.

( బలదాసర్ ప్రవేశము. )

బావగారూ! రండి. యిటునిలువుడి. నే మీపైనెచ్చిన మీయంగరేఖమాయును. దానిని విప్పుదురా? నేనును నా యంగరేఖ విప్పెదను.

బలదాసర్:-మంచిది. ( అనుచు నంగివిప్పును )

డియాగో:-( తనయంగివిప్పి ) బావగారూ గోడకుమొగముద్రిప్పి యించుకవంగెదరా?

( బలదాసర్ వంగును డియాగో వానింబట్టి క్రిందఁబడఁద్రోచి పైనఁగూర్చుండును )

బలదాసర్:-డియాగో! ఏమి నన్నుఁగ్రిందికిఁగెడపి పైనఁగూర్చుంటివి?

డియాగో:- బావగారూ! కుయ్యకయూరకుండుడు, మీచాంచల్యమునడలుఁడు. మిమ్మిపుడు గట్టెద.

బలదాసర్:-అయ్యో! డియాగో! నన్నువదలుము. అటుచేయకుము; నాజీవనము చెడపకుము ( అనుచుఁ గదలియాడును )

డియాగో:-బావగారూ! మీరు గదలక యూరకుండెదరా! నాచేతిపిడిచివాలున పొడిచి యిత్తునా?

( అనుచుఁ బిడిచివాలుచూపును )

బలదాసర్:-డియాగో! చంపకుము-చంపకుము? నీయానతిరీతిఁ బడియుండెద.

డియాగో:-అదిగదా బావగారి బుద్ధికుశలత? ( అనుచుఁ జేతులుగాళ్లుగట్టివైచి, బలదాసర్ యంగరేఖ దొడఁగికొని కారాగృహముతెల్వడి తలుపుమూసి )

ఉ. పంజరమందుఁజిక్కి బహుబాధలఁ జెందెడు పక్షివైపడిగా
రంజనదక్కికారఁబడి రాయిడిఁజెందఁగనెవ్వఁడోపు? నే
నంజక యీ తలంబు దిగనాడి విదేశముఁజేరి యెట్టులై
నం జెలువారు మేతియును నావశవర్తినిగా నొనర్చెదన్.

ఈస్థలంబున నొకనిమిషమైన నిఁకనిలువఁజనదు, శీఘ్రంబునంబోయి పడవఁజేరి తెల్లవాఱునంతలో నీయధికారుల మేరమీఱిన దూరదేశంబుఁజేరెద.

( నిష్క్రమించు. )

# తృతీయరంగము.

## అస్మర్ బేగు—సుల్తాన బేగు.

అస్మర్:—( సుల్తానాబేగునుజూచి ) తండ్రీ! ఇంతటినుండి నిను సేవించుమేర మీ రెను. ఇఁక నెవరిదారి వారిదియ. మక్కాముదీనులకు నీవేపొమ్ము. నేను ఢిల్లీ నగరంబునకుం బోయెద.

సుల్తానా:- ఢిల్లీలోఁ గార్యమేమి?

అస్మర్:—పాదుషావద్దఁగొలువు.

సుల్తాన:- కుమారా! కొలువేల? ఒంటికిలేని వ్యాధిఁదెచ్చుకోనేల? కొలువు బలుబరువు. ఆకొలువుగదా నిన్నింతటి కొలఁకుదించినది? ఆకొలువుపేరు కలలోనైన దలపకుము. మక్కాకుంబోయి సుఖమున నుందము.

సీ. సతతవేతన మృషాసంతుష్టియవుఁగాని
నిరతసంతృప్తియే నీచసేవ?
విపుల విత్తార్జనావీతంస మవుఁగాని
నిరపాయమార్గమే నీచసేవ?
అధికారమోహామదా కృతి యవుఁగాని
నిర్మలధర్మమే నీచసేవ?
అవినయాద్యవివేక భవదుఃఖ మవుఁగాని
నిరవద్యసుఖదమే నీచసేవ?

గీ. నియమవిరహిత దేహవిక్రయము గాని
నీతియుతహితకర్మమే నీచసేవ?
నిగమ నిగదిత నింద్యము నీచసేవ?
నీకుఁదగునేర? తనయ! యీ నీచసేవ?

అస్మర్:—తండ్రీ! సుఖమునకును నాకును నాకమునకు నరకమునకు నున్నంత దూరము. అవమానవహ్ని గుండెంబునంబడి నిలువెల్లంగాలుచుండు నాకు సుఖముండునే? “అవహ్యాంక్షాతి దుర్వాక్యం మేఘాంతరితర్మాదవత్” యనునది వినవే? అకటకటా! అంతటి యవమానమా? నే గోరివరించిన నారీమణియెదుట నన్నుఁ గేరి దూరిన వైరుల ప్రాణవాయువులు గ్రోలునంత వఱకు నాకనులనిద్రపట్టునా?

ఉ. వైరులు మేరమీఱి నను వారక దూఱుచుఁ గేర, నేను, నా
ధారములేనిపాఱుని విధంబున సొంపఱి, పందఁబోలితిన్
ధారణిఁ బ్రాణమున్న నది తప్పినవాఁడనుగానె? యక్కటా!
యా రిపురాజి నాఁడిఁదెగటార్పక కన్నుల నిద్రపట్టునే?

తండ్రీ! ఆస్థానమునం దానాఁటి సభ్యుల మాటలు నామేనన్నాటి తూటులుపడినవి. వారిని ఖండించి నాదారను జోరియాను జేరుటకంటె వేఱుసుఖ మీధారణి నాకెద్దియును లేదు.

సుల్తాన్:- కుమారా! ఈచలపాదితనము వలదు. నాహితమువినుము.

మ. పగసాధింపఁగఁబూను వాంఛమదికిన్ బ్రహ్లాదమున్గూర్చు, యిం
పుగనుండాదినిఁ గొన్నినాళ్లు, పిదపన్ బోకార్చునమ్మోదమున్
వగపన్ వహ్నిఁదగల్చి కాల్చుమతినిన్ వాడించుదేహంబునున్
దగదెవ్వారికి నిట్టిబుద్ధి విను నా తండ్రీ! హితంబంతయున్.

బాలకా! బలాబలంబులెఱుంగక చలముసాధింపఁ గోరుట నేలవిడిచిన సాముగదా? నీవా యొక్కఁడవు. బలహీనుఁడవు. నీవైరులా బలసంపన్నులు రాజ్యాధికారులు. వారితో నీవు పోరన్పూనుట మృగేంద్రములతో గజాబాలకము పోరుసల్పుటగాదా? [illegible]

మెదరిన విధంబుగదా? తనయా! కొండను మేషము ఢీకొనిన నేమియగును? నక్కయెక్కడ? నాకలోకమెక్కడ? వలదిట్టిదుర్బుద్ధి. నాహితమువినుము. తాలిమిబూనుము. తాలిమి నిను గాపాడును తనయా!

కం. వ్యసన వ్రణ పీడితులకు
నసదృశ తైలంబు తాలిమయి యింపొసఁగున్
దొసఁగుల యిల్లగు చలమున
నసువులు బోకార్చి కొందురా? కీడిదిరా!

తనయా! చలము ముంచును. తాలిమి తేల్చును. చలము దుర్బలము. తాలిమి బలము. చలము తను జంపువిషము. తాలిమి బ్రదికించు నమృతము చలము రాజ్యము గూలించు. తాలిమి రాజ్యమేలించు. ఇట్టిసుగుణాలవాలమయిన తాలిమి వదలి కలుషజాలమైన చలమూనుటతగునా? వలదీచలము.

అన్వర్:—( కోపమున ) మదిమదితప్పి యేమిమాటలాడెదవు?

కం. మదికుదురు చెదరి ధీరత
వదలిన ముదుసలివి నీకు వచ్చునె ధైర్యం?
బదరని గుండియగల నా
మదినొవ్వఁగఁ బలుకవలదు మానుము తండ్రీ!

జనకా! నీవీభంగి పిరికిపలుకులు బలికి నన్నుఁ గలంపకుమీ. ఆ డిల్లీ చక్రవర్తింజేరి యేతీరున నైన నెట్టికార్యంబునైనఁ జేసి వైరశుద్ధికిం వారిఁ గనియెద. అంతవఱకును మానావమానంబులు తృణసమానముగాఁ జూచెద. విఫల మనోరథుఁడనైతినేని విగతాసువునయ్యెదనుగాని జీవచ్ఛవుఁడనై బ్రదికియుండనోప. ఇద్దియనా నిర్ధారణము, ననుఁగాదని పలుకకుము.

సుల్తాన్:— తనయా! నిను మక్కాకుం బిలిచికొని పోయెదనని మహారాణిగారికి వాగ్దానంబిచ్చి నీ మరణదండనఁ దప్పించితిని! ఇపుడు నీవీరీతి వేఱుదారిఁబోయిన వారేమని నను దలంతురో యాలోచింపవలదా?

కం. నాలుక మానము దెచ్చును
నాలుక యవమానమిచ్చు నరులకుఁగాన్
నాలుక కాపాడఁగవలె
నీ లోకమునందు శాస్త్రహితమిది తనయా!

తనయా! జనకునిమాట జవదాటుట ధర్మముగాదు! కొలువునీకేల? నే బ్రదికి నన్నిదినంబులు నిన్ను సుఖంబుగాఁ బోషింతును. మక్కాకురమ్ము.

అన్వర్:— [కినుకతో] ఏమీ! శూరుఁడనై జన్మించి పెంపుడు పేఁపివలె నీ ప్రాపునఁ బడియుండవలెనా? అదిపౌరుషమా? వలదిట్టిపలుకులు.

సుల్తాన్:— కుమారా! నన్నిట్టి వృద్ధదశలో నొంటరిగా విదేశమున వదలి పోనునా? జరాతురయుండనై క్రుంగుతఱి నీవుదప్ప నను రక్షించు దిక్కెవరు?

సీ. ఏకపుత్రుండని యేమఱకెత్తుఱిఁ
గనుఱెప్పవేయక కాచినాఁడ
నీరెండకైనను నిలిచినవాఁడనో
యనుచు నీయారోగ్య మరసినాఁడ
వంశమువర్ధించువాఁడవు నీవని
కలవిద్యలెల్లనుఁ గఱపినాఁడ
అన్నవస్త్రాదులనైననేఁ గోరక
కొదవలేనిధనంబు గూర్చినాఁడ

తే. గీ. యింత యొనరింపఁ గతము నీవెన్నఁగలవె?
జరను గ్రుంగెడు వేళను సరసనుండి
యధికమమతను బోషింతు వనుచుఁగాదె?
తనయ! నినుఁబెంచితిని యిన్నిదినములయ్యో!

కుమారా! ఇన్ని యిడుమలఁ గుడిచి నిన్నుఁగాపాడిన నాయందు నీకీ కఠినత యేల? తనయా! నా మరణానంతరమున నీవెంతైన నుండనగుఁగదా! ఇప్పుడు నన్నెడఁబాయుట నీకుధర్మమా! ఇది కలుషకర్మముగాదా? నినువేఁడెద. నీ పయనము వదలుము.

ఆస్మక్ బే:— చాలు చాలు! నీ బయకారి మాయలసుద్దులు. చచ్చుటకు సిద్ధపడియున్న నిన్నుఁగాచికొని యుండు పనియా నేను జేయునది? సరి సరి! మంచిహితము లుపదేశించితివి! ఇట్టి బోధలు నాయందు ఫలించునని చూచితివేమో? ఎన్నటికిని ఫలింపవు. ద్రవ్యమిచ్చినచో నెవఁడయిన నినుఁగాచికొని యుండును. నీవు చచ్చినచో నెవ్వఁడో యొకఁడు నిన్నీడ్చివేయును. ఇంతపనికి నే నేల? ప్రయాణమయ్యెదను. నన్ను నివారింపకుము.

సుల్తాన్:— తనయా! తనయా! ఆస్మక్! ఆస్మక్! వలదు వలదు పోవలదు. నన్ను దిగనాడి పోవలదు. కుమారా!

కం. కుల శీలంబులు దలఁపుమ
కలఁగకుమా చలముఁబెంచి, కానిపనులనున్
దలఁపకుమా, ముదసలి నను
గలుషంబులు ప్రేలి యిటులఁ గాఱింపకుమా.

తనయా! ఇట్టికఠిన కలుషవాక్కులచే నన్నుఁగలఁచెదవేల? నా హితము వినవేని యందుల ఫలమనుభవింతువు. వలదీచలపోరుతనము.

ఆస్మక్ బే:— ఏమీ! నాకు శాపమిచ్చెదవా? ఇట్టి గుడ్డి బెదరింపులకు బెదరువాఁడనా నేను? చాలు చాలు నీ యేడ్పుహితములు వినువారెవరు? ఎవరిదారి వారిది. నను నివారింపకుము.

(అనుచు నిష్క్రమించును)

సుల్తాను:— అయ్యో! కుమారా! నన్నుఁగాదని వెడలితివియా? ఛీ! చాండాలా! ఎంతదురాత్ముండవైతివి?... హా! హా! ప్రథమమునో దుష్పుత్రుఁడు బుట్టుటకంటెను తండ్రి గొడ్డగుట మేలు గదా? అకటకటా?

సీ. పులికి మాంసంబిడి పోషింప నది
తలవేఁచి రక్తకుఁబంపు విధముగాదె?
పాలోసిఁయ విషజిహ్వఁబాయని పామటు
లౌఁగదా! దుష్పుత్రుఁడవని నకట
అనపత్యుఁడగుటమే లవినీత తనయునిఁ
గలుపాపచారునిఁ గనుటకంటె
అట్టిపుత్రుఁడు పుట్టినప్పుడే తండ్రి
పోఁదట్టక తడయుట తప్పు తప్పు

తే॥గీ. ఏమిసేయుదు దైవమా! యెంతకిట్టి
కాలమొనఁగూడె వృద్ధుఁడౌ కాలమునను
మానసోపని దుఃఖ మనూనమయ్యె
మననఁగ నోపను నే జరామయుఁడనైతి

అయ్యో! అస్మకా! నీవు పుట్టి నాకెంతయు [illegible] దెప్పితివి [illegible] నన్ను [illegible] పోయిన దినమునసే నీవును బోయియుండిన దుఃఖము [illegible] కాలమున కూఁబడిల్లు చుంటిని గదా! నీవు జనించి నాపేరు తెలిపి [illegible] కులమునకే యవయశము దెచ్చితివి. అయ్యో! [illegible] చి నీఁడెంతటి యదృష్టవంతుఁడగునోయని యుబ్బొంగు చుంటిసిగదా? [illegible]! [illegible] పెడవారిఁబట్టుట తెలియనైతివి. ఏమిసేయుదును? చిన్నచెన్ను పెద్దగద్ద యనునది నిజమయ్యె! ఇఁక నీ ప్రపంచంబున నా కెవరున్నారని జీవింతును? హా! ప్రాణంబు వదలుటమేలు. అపని నిచట నేల సేయవలెను? మక్కాకుంబోయి యా పుణ్యక్షేత్రముననే యసువులు ద్యజించెద.

( నిష్క్రమించును )

## చతుర్థరంగము.

అస్మకాదే:—నాకుంబట్టిన పీడ నేటికి వదలెను. కాలినంతలిగదా ముదసలితోడు! ముందు కర్తవ్యంబెద్ది? ఢిల్లినగరముగదా నేఁ బోఁదలంచిన పట్టణము? గచ్ఛత్పిపీలికా న్యాయమున నాపురిఁ జేరెదను. చేసి. యేమిసేయుదును? అది నాకుఁగ్రొత్త. మిత్రులు తెరు:..ఏమీ! ఆలోచన యేల? ఊరుక్రొత్తదైన నోరు క్రొత్తదియా? బుద్ధిక్రొత్తదియా? పోయెదను. జనులలోఁ బరిచయము చేసికొనియెదను!... వెనుకఁ జేయఁదగినపని యేమి? పాదుషా కొమారుని స్నేహము జేయవలెను. అతఁడు కటకట గాయకుల మిత్రుఁడఁట. జారశాంతాదిహోదుఁడఁట. సంపన్ను లచరణము నమముగదా? వానిఁ జెంది రాజాశ్వఖరన్యాయ మనుసరించి విచారా

విచారములు మాని నాని దుర్వృత్తులకెల్లఁ బోఁడయి రయే నీచకృత్యములనైన నాచరించి యాదరపోషణార్థ ధనమార్జించెద నిపుడ సేనాధిపత్యంబు సంపాదించెద. అనంతర మహాను న్నగరు [illegible] ముసు వర్ణించి యా పురిపై దండెత్తు [illegible] చేసెద [illegible] జోరియాను దారగఁజేసికొని [illegible] తేని నాయంతటి ధన్యుఁడు [illegible] మెవలుగుఁగదా? అటులేలగు?

గీ. వైరవు దొంఁకెను ఫలమబ్బు వెఱప వలదు
మనమ! చెదరక నీవు నెమ్మదినిఁ గనుము
మానమర్యాదలను మాని కానిపనుల
నైనఁ జేయుమ ధైర్యమ్ము విడక యింక.

ఇదియ నా నిర్ధారణము...... [illegible] చెంద్దైనది. ఇంచుక విశ్రమించుకొని ప్రయాణ మయ్యెద (పండుకొనియుండును)

(డాన్ డియాగో ప్రవేశము.)

డా॥ డి:— (స్వగతము) హా హా! ఘటికి కుంటిని....., అధికారులమేర దూరమాయె. వారిఁదడి లేదు. ఇంచుక విశ్రమించి కొనియెద. (కూర్చుండి)... మాయావులనోట మన్నుగొట్టి మరణము తప్పించుకొంటిని నిజము, కటవి బ్రతికితినని గంతులు వేయుటతగాదిది...ఆ శాలోవరి యహమన్నగరు నందున్నదిగదా యిపుడు?...అపురి నేఁజేరుటెటుల? చేరి యా వారిజనయనను గూడుటెటుల?...(ఆలోచన సఫలమయింది) సరి. ఆరచోరులం జేరి వారికిగురుడనై మేరీమందిరము ప్రవేశించి దానిఁబరిగ్రహింపవలెను.

ఉ. చోరులసంఘ మేర్పరచి చొక్కడుమందులు గూర్చి రాత్రులన్
దారులుగాచి నిష్కరుణ ద్రవ్యముదోఁచి యనారతంబు నా
హారవిహారము ల్మఱచి యా యహమన్నగరంబుఁజేరి నా
మేరినిఁబట్టి తెచ్చెదను మేనునఁ బ్రాణములుండ నేనియున్.

ఇదియ నా నిర్ధారణంబు.

ఆన్మర్:— (లేచి స్వగతము) ఏమీ! డియాగో ధ్వనిగనున్నది (లేచినిలిచికొని) అరె! అతఁడేనే! ఏమి డియాగో! ఏకాంగిగ నిచట నిలిచితివి?

డా॥ డి॥:— ఓహో ఆన్మర్ బేగు! నీవేనా? ఎన్నాళ్ళకెన్నాళ్ళకు [illegible] కుశలమా!

ఆన్మర్:— అయ్యా? కష్టజీవులకుఁ గుశలమెచ్చటిదయా?

డా॥ డి:— ఆ! మఱచితి. ఇటీవల నీకుఁ దెప్పరమైన యుపద్రవము సంభవించెనని వింటిని. అది యెటు పరిణ మించె?

ఆన్మర్ బే:— వివరమేల మృత్యువునోటినుండి క్రక్కఁబడితిని. నా మిత్రులందఱు దుర్మరణంబునకు గురి యైరి. దుర్భరశరీరంబు ధరించి నేనొకఁడ నిలిచినాఁడ. దారయును నేఁగోరిన [illegible]

యనెడి నారీమణిని నానుండి వెలిదీసిరి. అయ్యో! ఏదియెట్లైనఁగాని యా మదవతిని గదియని నా బ్రదుకేమి బ్రదుకు? వ్యథ - వ్యథ, నిరంతర వ్యథ.

చ. మననికనేల నేనిలను? మానినిఁగానని ప్రాణమేల? యా
వనరుహలోచనఁ గనని వాసి యదేఁ? యరాళకుంతలన్
మనసిజ లీలలం గలసి మన్నన లందనిమాన్యతేఁ? యా
ఘననిభవేణి దారఁగను గాంచని జన్మమదేల? మిత్రమా!

డాండి:— అకటా! మిత్రమా! నాబలె నీకును నిట్టికష్టం బొదివెనే? తరుణినిఁ గామించి విఫలమనోరథుఁడనై యహరహంబు వగచు దురదృష్టుండ నేనొకఁడనేయని తలఁచితి. మనమిరువురిపుడు సమానదుఃఖులమైతిమి.

అస్మర్‌బేగు:- నీవెవతెను వరించితివి? అదియెట్లుల పరిణమించె?

డాండి:— మిత్రమా! అదియొక చరిత్రగానున్నది. చెప్పఁజాలను. మేరీయను సుందరిని నా యువదారఁగఁ జేయఁదలంచితి. మితిమించితి. ఆపాతిరయే, యమదూతయై నను బాధించెను. అధికారులు నిజమెఱింగి నన్నుఱేఁదియ నాజ్ఞాపించి చెఱనుంచిరి. కారఁగాదువారికిఁ గుండ్లుకట్టి కడకువెడలి, పలాయనమే ప్రాణమని నిలిచినచోట నిలువక పరుగిడి యిటుఁ జేరితి...... అయ్యో! మాయుభయుల తల్ప్రాఁత యిటులయ్యెనే? అకటా! ఆయంగన సంగమ సుఖానుభవరహితుఁడనే నవని మని యేమిప్రయోజనము?—అకటకటా! జనన భూమికి దూరమైతిమి. బంధువులకు దూరుపడితిమి. రాజదండనకు గుఱియైతిమి. మిత్రులకు శత్రులైతిమి. జనులకు నారడిపాలైతిమి. కడుపునకుఁ గూడులేదయ్యె. పట్ట నొక కొమ్మలేదయ్యె. రమ్మనియొక బలుకుఁ బలుకువారు లేరు. మనగతి యిటులయ్యె. ఏమి సేయుదము?

అస్మర్:— మిత్రమా! రండావేణి స్మరణన్యాయమ్మునఁ జింతించిన నేమిప్రయోజనము? అరణ్యరోదనముగదా? పోనిమ్ము 'యద్గతంతద్గతంగతం'. దుష్టులమని యపయశమునొందిన మనకు మరల మంచిపేరువచ్చునా? చెడినపాలు చక్కనగునా? చెడినపేరు చక్కఁబడునా? ముందు దుర్మార్గవృత్తియ మనకు జీవనవృత్తి. ఇట్టికష్టవృత్తినైనను మనము మనఁగోరుట మనమోహించిన మానినీమణులఁ బొందుటకుఁగదా? దానికై మానవప్రయత్నము సేయవలెను. "నహిసుఖం దుఃఖైర్వినాలభ్యతే" యనునది వినవా?

డాండి:— నిజము నిజము. అదిమానినచో మనము మననేల? దానికై యేమి యాలోచించితివి?

అస్మర్:— పాదుషా కొమారునివద్ద కొలువు సంపాదింపఁ బ్రయత్నింతము.

డాండి:— సరి సరి. కాలుపెనమునుండి కీలి కీలలలోఁబడిన వెతలు లగుదుము. చేరుతిచ్చి ఖడ్గము గట్టించి కొనువారు గలరే? పాదుషా గోవావారికిఁ బరమమిత్రుఁడు బీజాపూరువారి యరివర్గమునఁ జేరినవాఁడును కాదు. మనపూర్వచరితం బతఁడెఱిఁగెనేని ముల్లుతీసి కొఱ్ఱునెత్తించికొనిన వారిమి యగుదుము. ఆలోచనచేయుము.

అస్మర్:— ఆలోచన గీలోచనలకిది తఱిగాదు. పాతలఁచినదియె చక్కని మార్గము.

డాండియాగో:- క. ఆలోచన మమృతంబని
యాలోకులు వాడికొనెడి హితముమఱచితే?
యేలా వేగిరపాటది
మేలగునే యేరికైన? మిత్రమ! వినుమా!

డాండి:— మిత్రమా! నాలోదనారహితులమై యిపుడెన్ని యిడుమలఁగుడుచున్నారము చూచితివిగదా?

చ. వెరవటి కార్యముల్నెఱపి, విక్లిబులైతిమి మున్నె మేము, మీఁ
దరయక రాజదండనల నారడిపాల్పడి నిల్వ నీడయున్
దొరకక యిప్పుడీగతిని దొంగలఁబోలి చరించువార మీ
త్వరతరమౌనె? మిత్రమ! నిదానముఁగాఁచిన నబ్బుసర్వమున్.

అస్మక్:— అటులైన నీవు దలంచునదేమి?

డాండి:— ( ఆలోచన నభినయించి. )

గీ. జారచోరులగుమిఁగూర్చి దారిఁగొట్టి
యుదరపోషణ మొనరించుచుండి పిదప
మనము గోరిన వనితల మందిరములు
దూరి నారుల గొనుటయ దారి మనకు.

ఇటులైన « నేకక్రియాద్వ్యర్థకరీ ” యనినరీతి మనయిష్టార్థముఫలించు.

అస్మక్:— ( నవ్వుచు ) సరి సరి. మంచియాలోచనయిది; దారులుగొట్టునపుడు దొరకితిమేనిఁ గారాగృహవాసమేగతి. వలదీ దురాలోచన. పాదుషా కూరుఁడైనను దారుఁడు. వివ్వ ప్రయత్నములుచేసి వానిమైత్రి నార్జించిన మనకార్య సాఫల్యంబగు. కొంతకాలము మనము మానమర్యాదలను మాటలే మఱచిపోవలెను.

శా. న్యాయాన్యాయ విచార మారయక నై చ్యానైచ్యము ల్చూడ కే
మాయోపాయమునైన బన్నుచును సన్మానంబులందెంది, యా
దేయంబైన ఫలంబు నందికొని యుద్దిష్టావహోత్సాహునిన్
జేయన్ శక్తులమైతిమేని మనకున్ జేకూరు నిష్టార్థముల్.

డాండి:— ఎటులయినను బాదుషాసుతుని మైత్రి నార్జించితిమిపో, పిదప మనకార్యమెటు ఫలించు?

అస్మక్:— తెలుప మరచితిని. నాదార యిపుడు సుల్తానాచాందుబీబీతోఁగూడి యహమన్నగరమునం దున్నది.

డాండి:— ఏమి విపరీతములాడెదవతూ? సుల్తానాయేద? అహమన్నగరేడ?

అస్మక్:— నిజము నిజము. అడుగఁదగినదియ యిది. అహమన్నగరమునఁ గలకాలము మెండ్రై రొయొక రుండినరాజాను మతిరొయొకరు వధించుచు దేశమంత నరాజకమై జనులకు దినమొక గండ

ముగ నుండెను. రాజవంశమునకు బహదూరను బాల్యుఁడొకఁడు మిగిలెను. ఆ బాలకుని నిర్మూలింప రాజద్రోహులు యత్నింపఁ బరిజనులందఱు సుల్తానాచాందుబీబీ వేఁడికొని యూకోమారుని పేరున రాజ్య మేలుటకు రప్పించుకొన్నారఁట. జననభూమి దాక్షిణ్యమును బట్టియుఁ బుట్టినయిల్లు నిర్వంశమగునని చింతించియు సుల్తానా యారాజ్య మిపు డేలుచున్నది. అంతయు నాదారసైతమున్నది. పాదుషాగారుఁడానగిరిపై దండెత్తుగా గొనరించిన సేనైట్లైన నాసుఁదవరకుఁ జెప్పకొంటిరొగ.

డాఁడి:—( తలయూఁచి ) నాదారసైత మచట్ల నీ యున్నదంటా! మాయిరువురిగుటి రొయొకటి యయ్యెను. మనకాపాదుషా కొమారుని సైన్యశిక్షించు మార్గమొకటి యాలోచనీయముగ నున్నది.

అస్మర్:— పురుషప్రయత్నంబుఁ జేయవలెను.

కం. అనృతములాడఁగనోడక
మనమున శంకింపకే యమానితకృత్యం
బునునైనఁ జేయఁబూనిన
మనయిష్టార్థము లభించి మనుమార్గమగున్.

డాఁడి:— ఫలించినచో మంచిదెపని. మంచిది. ఇఁకముందు మనస్వాక్షియను విషయమునకే నే నెలవిచ్చెద. మాయోపాయముల కాలవాలమై యుండెను. మానమర్యాదలీ మహిలో లేవని తెలిసెద. ఇఁక నాలస్యమేల త్వరగఁబోవుదము.

( నిష్క్రమింతురు )

పంచమరంగము.

డిల్లీ పట్టణము.

అస్మర్ బేగు - డాఁడియాగో.

అస్మర్:— స్వగతము.

చం. చలమునఁబోరి శాత్రవులఁ జయ్యనఁ గూల్తు రణోర్విఁ, సైనికా
వళి యిపుడయ్యె నావశము వారక వానినిఁగూడి నేఁడు భూ
తలముఁ జలింపఁజేసెదను దప్పను, ముప్పనఁగూడ సైఁచెదన్
వలచిన యౌవనిన్ గలయ వచ్చెను గాలము సంతసంబరోన్.

హా! హా! నాఁడా చాందాలి చాందుబీ యాస్థానమునందుఁ గల్లుద్రావిన కోఁతులవలెఁ జెలరేఁగి పలువిధములఁ బలువకూఁతలు పలికినవైరి వర్గమునుఁజూచి భీషణ రోషరసావేశ జాజ్వల్యమాన మానసుఁడనై నేవాడిన నుడి దక్కించుకొనుతటి తటస్థించెను. మాటవాని గనని మానవజన్మంబుండనేమి? మందనేమి? వివిధ మాయోపాయములునెఱపి మహారాష్ట్ర ధానీకుల్ మిర్జాల పీనులలో పీడుకట్టికొని యవాలహామాహావమున కహమున్నగరు

దండెత్తుటకు బోధించి యుద్ధము సాధించితి. మాయోపాయములకుఁ జిక్కని మానవుఁడెవఁడు? పాదుషాగారు సకలసేనను నావశపఱచిరి. రాజ్యాభివృద్ధి నాశింపనివారెవరు? వైరి రాష్ట్రమును మహామారి మసంగినట్లు గలంచి కట్టడి దొంగలు పోసంగులాగొనరించి నాఁడాసభలో వీనులప్రయ్యఁగ పరుషదుశ్శ్రవ దూషణ భాషణములాడిన మానవాధముల నాలుకలు నిశాతతర శతారసమాన మగు నా కరవాలధారచేఁ గోసి వైరశుద్ధి నొంది సంతసించెద. అరుల నురులందవిలించి ముదమందని వాఁడెవఁడు? నాకార్యసాఫల్యమునకు సంచకరువుగ నహమన్నగరున సమ్మోహకలహములు సంభవించెనఁట. అంతశ్ఛిద్రములుగదా రాజ్యోపద్రవములు రాష్ట్రక్షయకారణములు? దక్కను సేనానియగు మియాన్ మిర్జా యొక్కఁడివానితో యొక్కబాలుని నహమన్నగర పీఠపదాస్థుఁడని పేరిడి దానిసాధించుటకుఁ బాదుషాగారి సాహాయ్యముఁ గోరెనఁట. మార్జాలమునరస మూషకము చేరినట్లాయెను. నాయత్నించుపనిలో నాపద స్వల్పము. లాభము హెచ్చు. జయముసిద్ధము. జోరియా లభించుట సిద్ధాంతము. ఇఁక నా లావణ్యలలామను బూవిలుకాని లీలాకేళిలో చేరెద. ఇదికదా గారావనుని పౌరుషము?

చం. పలచిన యింతిని న్వదలి వంతలఁగుందుట పౌరుషమ్మె? భూ
తలమున నట్టి పంద ఘనతన్గను నే సరివారిలోన? నా
కులుకుమిటారినిన్ గవిసి క్రొవ్విన యాబిసుఖానుఁజంపి పూ
విలుతుని కేళిలో సతిని వేడుక నేలుదు నాత్మ సంపదన్.

( డాన్ డియాగో ప్రవేశము. )

ఏమయ్యా! ప్రయాణసిద్ధుఁడవై తివియా?

డాన్ డి:-- సిద్ధుఁడనుగాక యేమి? అహమన్నగరునకుఁ బ్రయాణమనిన నామూపురములు మూఁడగుచున్నయవి. ఎపుడెపు డాయాస్మేడా నవుగంటఁ బ్రొక్కుదునో, యెపుడెపుడా సుందరి యాను రతిక్రీడలఁ దేల్తునోయని యనవరత ముత్కంఠాయుతుఁడనున్నవాఁడను. ఇక్కార్యంబు ఫలించుటకు నెక్కాలియలనైనఁ బడిరెద.

శా. మానప్రాణధనంబు లెవ్వఁడిల సన్మానించి లాలించు న
వ్వానిన్ మారుఁడు మానవాధమునిగాఁ బాటించి జీవచ్ఛవున్
గా నెంచు న్మదిఁ గాదె? కావున భువిన్ గాంతారతుం డెత్తతిన్
హీనంబవ్వియటంచు మానసమునం దెంచున్ సుఖాసక్తతన్.

ఆన్సన్:— ఇదికదా పౌరుషము? మిత్రమా! ఇట్టికూరుఁద వాచార్యవృత్తి నెట్టుల యవలంబించితి వయా?

డాన్ డి:— సఖా! ఆచార్యాధికార్యంబనెడి యంగరేఖచేఁ గప్పంబడి కాలనేమిబలె జపము సేయుచు నెన్నియవమానిత కృత్యంబులనైన నొనరింపవచ్చును గదా? వందనీయులు నింకానస్థలని

యుండు కాఱిదూషణ దోషార్హులయినను జనులు నోటికి బీగము వేసికొందురు. ఆచార్యులకు శిష్యులాఁడువారు. వారే యాచార్యుల విశ్వాసపాత్రలు.

అస్మర్:— అవునయా! యథార్థము వచించితివి. రాజకీయాధికారంబునకంటె నాచార్యాధికారంబే విషయంబున హెచ్చు.

గీ. మచ్చువేదాంతములుగాదె మచ్చికంటి
గుమిని లాగెడి గాలపు సమితి భువిని?
దీని నెఱిఁగియుఁ గాదె నవీనముగను
యౌవనాఢ్యులు స్వామిత్వ మరయువారు?

డా॥ డి॥:— మాజాతి మీజాతియన నేల? అన్ని జాతులలోను గొందఱాచార్యులకి వేకూడు.

అస్మర్ బే:— నిజము! ఈమాటలిఁకఁ జాలు. తలవచ్చినపుడు శరీరము దాఁచితిమో బోటులు మనకు దొరకుట బూటకమగును సుమా.

కం. పౌరుషమె మానవంతము
పౌరుషరహితంబునైన పామరునివిధం
బౌ రాతి ప్రతిమయుంబలె
పౌరుషరహితుండు బ్రదికి ఫలమేమి యిలన్?

పౌరుషము ప్రాధాన్యము. కష్టములకేమి? అవి పుట్టుకతోడన వచ్చును. వానిని సరకు సేయక కార్యనిర్వాహక కర్తయగుట కీర్తనీయము. పక్షిరాజును జూచిన సర్పములఁ బోలె వైరులు తమశిరసులు వంతురు. కష్టంబొనఁగూడని కార్యఫలంబు కూరునకిష్టంబగునే? సంతాపానంతరము గదా సంతసము రుచి?

డా॥ డి॥:— చక్కఁగఁ బలికితివి. నిజమిది. మనసేనఁ గూడికొని వెళ్లుదము రమ్ము.

అస్మర్ బే:— పోదము.

(నిష్క్రమణము.)

శ్రీ

# చాందుబీచరిత్రము.

షష్ఠాంకము—ప్రథమరంగము.

అహమ్మదునగరు.

రంగయసెట్టి—శేషప్పసెట్టి.

రంగయసెట్టి.—క. చల్లఁగ నిద్దురపట్టిన యిల్లున్
వాకిలియు వదలి యెటులేగుదు? నేఁ
బిల్లలఁ బాపల నెఁకనే కల్లన్
ద్రోయుదును? కఠినకాలము వచ్చెన్.

(ఆలోచన నభినయించి.)

అకటా! పిల్లపాపలను దూరదేశంబున కెచ్చటికైనను బంపఁగలను. వారిదొక విశేషవిషయము కాదు. పుట్టించిన విధి బ్రదుకు తెలుపుఁ జూపఁడా? వారికేల నేఁ జింతింపవలెను? కడుపుఁగట్టి, పిల్లపాపలనోట గడ్డకొట్టి జనులనందఱిని వికృట్టులఁబెట్టి నాప్రాణమునకంటె హెచ్చుగ రక్షించిన ధనము నే నెచటఁ బెట్టుదును? కొల్లకొట్టువారు నాయిల్లు శాశ్వతము వలనైనను ద్రవ్వి ధనమును వెల్లగింతురు. దీనికేదైననొక సదుపాయంబు సేయవలెను. పాదుషాసేన జయమొందినచో రెండుదినముల గండము తప్పినదికాదు. దానికి వేఱొం దుపాయము సేయవలెను.

(శేషప్పసెట్టి ప్రవేశము.)

శేషప్ప:— (రంగయశెట్టినిఁజూచి) ఏమి బావా! బేపారమంతయుఁ దీరినదియా? చింతసేయుదువేల? నష్టమేమయిన వచ్చినదియా?

రంగయ:— ఇంకెక్కడి వ్యాపారము? అపూపారమే.

శేషప్ప:— బావా! ఇదేమి? ఇంతటి కెంపుమాటలు! దేహారోగ్యముగదా?

రంగయ:— దేహమునకేమి? ఇపుడు బ్రదికినన్ని దినములిఁక బ్రతికెదను. ఈ యుద్యమము వన్నె మిసేయును? అది యాయుర్వృద్ధికారి.

శేషప్ప:— మఱియెందుకు నీవిటు మాటలాడెదవు?

రంగయ:— బావా! వినలేదా నిన్నటిచాటింపు?

శేషప్ప:— లేదు. ఏమి యది?

రంగయ:— ఢిల్లీ పాదుషాగారి కొమారుఁడు గొప్పసేనతో మాపురిపైకండెత్తి వచ్చుచున్నాఁడఁట!

మనతల్లి చాందుబీగారిసేన యత్యల్పముగనున్నయది. ఆతెల్లిగారు తమకేతూరి జయము సందియమని యెన్నికాఁబోలు తమపిల్లలగనుంచి మమ్ము రక్షింపఁ దలంచి యిష్టానుసారము జనులెచ్చటికైనను బోవగునని తెలిపిరి. ఇదియు నా విచారకారణము.

శేషప్ప:— ఏమీ! ఏమీ! పోయినదయేమి సంధి. ఈయేమి యుద్ధమా? ఈమిడిసిపాటునకుఁ గారణం బేమి?

రంగయ్య:-- తురకలకుఁ గారణమేమి కావలయును? కత్తి కత్తి చేతఁ బట్టుదురు. విప్రులయొక్కయు వైశ్యులయొక్కయు రోషము తురకలయందుంపఁబడినది. తురకలు తమ తాలిమంతయును మాకు దాఁకపోసిరి. రోషము వారి శరీరమంతయు నిండి లో నిలువక కండ్లలోను ముక్కుపైనను బొంగుచుండును.

శేషప్ప:— అదినిజము. బావానిజము. సంధి చెడుటకుఁ గారణంబేమి?

రంగయ్య:--ఎచ్చటనో పల్లకాతిగో ఢిల్లీసేన నడుచుచుండెనఁట. ఈరాజ్యపుసేనలో నెవరో క్రొవ్వి వారి దారిని నడ్డగించిరఁట అందులకు మరల యీయుద్ధము.

శేషప్ప:— ఇంతటి స్వల్పకారణముండదు. మఱియేమో కారణమున్నది.

రంగయ్య:-- అది తెలిసినదేకదా? ఢిల్లీపాదుషాయను బిడాల చక్రవర్తి యహమన్నగరను శుకమునుఁ బట్ట సదా కాచియుండును.

శేషప్ప:— ఇదినిజము. మేషయుద్ధములో నక్క చిక్కినట్టు వీరిరువురి పోట్లాటలో మనప్రాణము పోవును.

రంగయ్య:-- ప్రాణముపోయినఁ బోనిమ్ము. అంతకంటెను హెచ్చగుధనము పోవును.

శేషప్ప:— ప్రాణముండిన ధనము సంపాదింపనగును.

రంగయ్య:-- ధనముపోయిన మీఁదట ప్రాణమున్నఁ బ్రయోజనంబేమి? అందుకు నేఁ జింతించెద.

శేషప్ప:— చింతయేల? బావా! ఎచ్చటికైనను వెళ్లిపోదము. ఊపిరియుండిన నుప్పమ్మకొని బ్రతుక వచ్చును. బేపారులు మనకేమి? ఎచ్చటనుండిన నచ్చటనే యిల్లు వాకిలి.

క. తఱిఁదోఁచదగు నాలోచన
తెలఁగొఱఁగినమనుజుఁడిలనుఁ దెలివిఁగలాఁడిం
పఱు నన్యుఁడుగావున, నీ
తఱినిట్లునిలువంగఁ దగదు తగదుర బావా.

బావా లెమ్ము. ఇప్పుడే వెళ్లిపోదము.

రంగయ్య:--నేనురాను నీచెల్లెలను పిల్లలను పిలిచికొని పొమ్ము. ఇల్లువాకిలి ధనము ధాన్యము వదలి ప్రాణముండఁగా వెళ్లిపోవుటకు నేనేమి పిచ్చివాఁడనా? నేనురాను రాను-రాను.

శేషప్ప:— పరసేన కొట్టునప్పుడు నీవిచటనుండిన నిను గనికరించి విడుచునా? హింసించును.

రంగయ్య:--అవాఁటికిఁదగిన యాలోచనచేసి యంతటి సమయంబున నైతము ధనము సంపాదింప ప్రయత్నించెదను.

శేషప్ప:— బావా! నీవసాధ్యుఁడవు. నాసోదరిని విలిచికొని నేవెళ్లెద. ఆమెకు గోడపు నెలవుల కేమయిన నిచ్చెదవా?

రంగయ్య:-- ఏమీ! నాభార్య నీయింటిలోఁ బనులు సేసెదం మలకు నీవుదానికిఁ గూడుపెట్టిరంగులకు నరిపోయెను. నేనొక గవ్వయయిననివ్వను.

శేషప్ప:— ఇఁక నీపిల్లలకెవరు కూడుపెట్టవలెను?

రంగయ్య:-- నాపిల్లలు నీమేనకోడండ్రుగాదా? మేనత్తకపు వియ్యంకుఁడనమున నేఁ గన్యాశ్రయ మడుగుదునా?

శేషప్ప:— (స్వగతము) వీనికి దుడ్డుననఁ బ్రాణము (ప్రకాశముగా) మంచిది బావా! పోయి వచ్చెదను.

రంగయ్య:-- ఇంటివరకు నేనువచ్చెద.

(నిష్క్రమము.)

ద్వి తీ య రం గ ము.

ఆల్ఫ్రేడా - మేరియ - వైద్యశాల.

మేరియ:--అన్నా! నిన్నటిరాత్రి యాతనిత్ప్రణవాయువుగఁ బ్రాణంబుఁజూచి కోటనుబ్రద్దలుగొట్ట సాహసించెనుగదా? అదియెటుల పరిణమించెను?

ఆల్ఫ్రేడా:—చెల్లెలా! మనతల్లి చాందబీ మరలఁ దన తల్లి గర్భంబునఁ బుట్టినట్లాయ్యెను. మనవారందఱు మృత్యుదేవతవాత మన్నుమొత్తిరి.

మేరియ:— అదియెటుల?

ఆల్ఫ్రేడ:-క. అరితతి యురులిడి మము, మా
పురితో హిత మిత్రబంధు పుత్రాదులతో
హరియింపనుండ దైవము
కరుణఁ రక్షించె బ్రదుకుఁ గంటిమి తుదకున్.

రాత్రి మనరాణిగా రెప్పటివలె రెప్పలోరెప్ప వేయక కోటపైనుండి యరికోటి కటిల చర్యలు కట్టుకావలిగఁ గాదుదుండ నాకస్మికముగ నేనచట వెళ్లితిని. అకల్లాదనటుల విశ్శబ్దముగ నుండెను. పోర్చుగీసు వారివి పాము చెవులునని సార్థకముగఁ గ్రిందిదిక్కున సురంగములో మందునించి దట్టించుధ్వని వింటిని. అవ్వార్త వెంటనే రాణిగారికి విన్నవించి యామెయానతి శిరసావహించి యా యపాయస్థలంబుఁ గనుగొంటిని. అక్కడే నిక్కట్టు కలహంబు సంభవించె. అరిసేన పరాజితమయ్యె. అందనేకులు నేలంబడికూలిరి. ప్రాణావశిష్టులై గాయములచే గాతియులఁబడు గొందఱు మన యౌషధశాల కిపుడే తేఁబడుదురు. వారిలో నొకఁడు మనదేశీయుఁడుగ నున్నవాఁడు.

మేరియ:— అన్నా! వాఁడా క్రూరుఁడు డాండియాగోగా నుండునా?

ఆ. వే. ఒకలినీడ వెన్నుఁ బడి వచ్చుచందాన
కడలు చేరి లేని కర్మఫలము
వెంటనంటి వచ్చు విధమున నాపాపి
యెచటఁ జూచి లేని నచట నుండు.

అన్నా! వాని పేరనిన నా శరీరము గడగడ వణఁకుచున్నయది. అకటకటా! చన్నీరాత్రు కొని త్రావు మనబోటివారిని నష్టకష్టములఁ బెట్టెను. వాని భీకరాకారంబు నిరంతరము నాకన్నులఁ గట్టినట్టుండును.

ఆల్మేద:— సోదరీ! నీకాభలుని కలవర మేల? శార్దూలములున్న తావు సారంగము చేరునా?

మేరియ:— సోదరా! నన్నువాఁడానాఁడు పలికిన పరిభవము మఱచెదనన్నను మఱప్రదట్టదు.

ఆల్మేద:— చెల్లెలా! గతస్య శోచనా నాస్తి యనునది యెఱుఁగవే? దుఃఖమానాఁ డనుభవించిన కారణంబున సుఖము తుదఫలించె. కర్తవ్య కార్యంబు మిక్కుటముగనున్నది. గాయములఁ గుందువారనేకు లిపుడు వత్తురు.

(భటులొకనినెత్తికొని వైద్యశాలలోనికి వత్తురు)

భటులారా! ఆ మంచముపై దింపుఁడి. (భటులు మంచముపైఁ బరుండఁబెట్టి నిష్క్రమింతురు. ఆల్మేద చన్నీరు మొగముపైఁ జల్లి గాయములు చూచుచుండును.)

డాన్ డియాగో:— నీరు నీరు (అని పలవరించును.)

ఆల్మేదా:— (వానినోటనీరువోసి గాయములకుఁ జికిత్స చేయును)

మేరియ:— (వానింజూచి కొందడుగులు వెనుకకుంబోయి) అన్నా! వీఁడా యవాచ్యుఁడు కాడా? చక్కఁగఁజూడుము.

ఆల్మేద:— చెల్లెలా! వీఁడెవఁడైననేమి? భీతివలదు. వీనికి సంకటావస్థ చెంతనున్నయది (మందువేయుచుండ డాన్ డియాగో నీరు నీరని యఱచును) మేరియా! నీరందిమ్ము. (మేరియ నీరిచ్చును. ఆల్మేదా త్రావును.)

డియాగో:- (డియాగో లేచి ఆల్మేదానుజూచి తలవంచి మరల తలయెత్తి) సోదరా! ఆల్మేదా! నేనెవఁడని నీవీ యుపచారమ్ములు సేయుచున్నావు? (హా నీరు. నీరుద్రావి) నీకుం దెత్తల్లడమై బాధించిన పాపిని నేనుగానా? దప్పి దప్పి నీరు నీరు (ఆల్మేడా నీరుద్రావించును మరల కన్నులు తెఱచి) సోదరా! నే నీచేతఁ దెచ్చికొనిన ఫలమీచేత ననుభవించుచున్నాఁడను. చదుచేఁత లెన్నిరయా నీకొనరించితి హా జలము జలము నోరెండుచున్నది. (ఆల్మేదా సాకాయి నీరిచ్చును) దప్పియాఱెను. సోదరా! ఏల నాకీమందులు? నాప్రాణము గడియలపై నిలిచినది. నరములు గుంజుచున్నయవి. నీకు నేనొనరించిన యపచారాగ్ని నామనంబు దహించుచున్నయది. మరల నీయుపచారము చిచ్చుఁ జేర్చి దానిం బేర్చకు? హా! నాతలతిరిగెడు నీరిమ్ము (ఆల్మేడా నీరు ద్రావించు) సోదరా! వైశరమ్ము లేఖన సామగ్రిఁ దెప్పింపుము.

ఆల్మేడా:—( మేరియానుజూచి ) చెల్లెలా! లేఖనసామగ్రి తెచ్చెదవా?

మేరియా:- మంచిది ( సామగ్రి తెచ్చియిచ్చును. )

డియాగో:- ఆల్మేడా! నేఁ జెప్పినరీతి వ్రాయుము.

ఆల్మేడా:-- సోదరా! వ్రాసెదను.

డియాగో:- సూరత్తు ధనభాండాగారాధికారులైన హేమచంద్ ప్రేమచంద్ గారికి. డా॥ డియాగో చేయువందనంబులు. మిత్రులారా! నేను మరణావస్థలో నున్నాఁడనుగాన నీమరణశాసనము వ్రాయించినాను. మీవద్దనుండెడి నాసర్వస్వము గోవాయధికారులైన యార్చిబిషప్ గారికి నివ్వవలెను. పీడ్రో డియాగో చనిపోయెను కాన వానిధనము నాకుఁజేరినది. ఓడను విక్రయించి యాధనమునుండి సేవకులవేతనములిచ్చి యందులో నైదువేల రుపాయలు నాసోదరసమానుఁడైన యాల్మేడా గారికిఁ బంపుఁడి. ఈశాసనము నేసంపూర్ణమయిన తెలివితోనుండినపుడు వ్రాయించినాఁడను.

డి. డియాగో డిఫోర్టిశికా.

సోదరా! ఈలేఖను సూరత్తువారికిఁ జేర్చుభారము నీయది. మిత్రమా! నీరిమ్ము! ( ఆల్మేడా నీరుద్రావించును ) సోదరా! ప్రాణానిలము కంఠగతమైనది. మఱియొక నీయనుగ్రహమునకై జీవము బిగఁబట్టినాఁడను.

ఆల్మేడా:-- సోదరా! అదియేమి సెలవిమ్ము?

డియాగో:- సోదరా! మహోగహనమందు మరుఁడు పాపకుఁడై దహింప నీసోదరినిఁ బెద్దబాధలఁ బెట్టితి. ఆ సుగుణరత్నఖని ననుఁగని నినుమన్నించితినని నుడివినచో నేఁ బడుబాధ లన్నియును మఱచి సుఖముగఁ బ్రాణంబులువదలెద.

ఆల్మేడా:— సోదరా! చింతింపకుము, ( మేరియాయని పిలుచును మేరీ దూరమునుండి వచ్చును మేరిం జూచి ) చెల్లెలా! ఇటుగనుము. అయ్యో! ఈపాపి నీకుఁదానొనరించిన పాతకంబునకుఁ బరితపించుచుఁ దప్పుమన్నించితినని నీవు నుడువువఱకుఁ బ్రాణంబులు విడవక బాధపడుచుండెదనని పలుకుచున్నవాఁడు! క్షమాగుణము నీయాభరణమని నేనమ్మి నినుబిలిచితిని తప్పు మనుజనైజము, క్షమ దైవసహజము.

మేరియా:--( ఇంచుక యాలోచించి జాలి నభినయించి ) సోదరా! డియాగో! తలయెత్తుము! పశ్చాత్తాపము మానసపరిశుద్ధికిఁ గారణము, మనోనైర్మల్యము దైవసన్నిధానము, ( అనుచు డియాగో కేలందు ) అన్నా! నినుమన్నించితి. భీతివలదు.

డియాగో:--ఇఁక సుఖముగఁ బ్రాణమ్ములు విడిచెద. ఆల్మేడా! ఒకగడియ యిచ్చట నిశ్శబ్దముగనుండు నటు లొనర్చెదవా?

ఆల్మేడా:—మంచిది అందఱు వెళ్లెదము. ఆ దురిత విదూరుని దైవమును ప్రార్థించుచుఁ ప్రాణంబులు వదలుము ( వాకిలిమూయుదురు. )

సీ. రహిఁగుణత్రయమను రజ్జువుచేఁగట్టి
మానవపశువుల మనుచు నెవఁడు
అంగనాసంగంబు నమరిచి సంసార
సాగరంబునఁదేల్చి సత్తునెవఁడు
[illegible]
కర్మలోలుఁజేసి కాంచునెవఁడు
స్వస్వరూపస్మృతి స్మారవిహీనులఁ
జేయుచు మాయలోఁజేర్చునెవఁడు

ఆ. వె. స్వామిభృత్యభేద సంబంధమునుఁగూర్చి
షడ్గుణాదికలుష సమితిఁజేర్చి
అప్రమత్తయోగ మను విద్య తుదకిచ్చి
మోక్షమొసఁగు దైవమునకు నతులు.

(నిష్క్రమము)

తృతీయరంగము.

డాక్టయిల్ మిర్జా - ఇబ్రహాంలోడి - ఖాన్‌ఖాన్ - ఆస్కర్‌బేగు.

మిర్జా:— సేనాధిపతులారా! ఈతూరి సైతము జయము మనకు మేఘపుష్పమగునని తోఁచెదు. చాందుబీ పోరవదలిన పాము మాడ్కి రోజుచు మనపై విషము గ్రక్కుచున్నదని చారులచే వింటిని. రణరంగమున నాయమ సాహస మసదృశముగదా!

సీ. నడిరేయి నడఁగుచుఁ బుడమి సురంగము
బడఁజేసిచూడ నక్కడనెయుండు
కడిమిని నడరుచుఁ బిడుఁగులబలె సేన
పడఁజూడ వానినిఁ బడలఁజేయు
యుడుమలఁబడి కడువడిఁగోటపైఁబడఁ
బడఁద్రోయు నెల్లరఁబొడవడంగ
ఉడివోక కుడియెడ మెడలెగ కడరిన
బెడఁజూచు భటులకు జడిమమూడ

తే. గీ. అరులప్రాణానిలము ద్రావు నహియనంగ
వైరవహ్నినిఁ జల్లార్చు వారియనఁగ
శత్రురూపంబుఁ దుదిమాపు శక్తియనఁగ
కలననెల్లెడఁగనిపించు గాంత యనదె?

సేనానులారా! ఈతూరి నవాలోచితంబుగ నైర్ధియుం జేయున్నోవ. ఈ విషయంబున మీ యభి ప్రాయంబు వినఁగోరెద.

ఇ॥లోడీ:— మహాప్రభూ! మనము యుద్ధప్రసక్తిమాని కోటను ముట్టడించి లోనికేవస్తువు నందనటులొనరింతము. దినక్రమమున లోనేన నన్నగిల్లినం బట్టణము మావశమగు.

ఖాన్ ఖాన్:— మహాప్రభూ! అనేకయుద్ధములలో నారితేరిన యిబ్రహీం లోడీగారి యాలోచన యధికానుభవ జనితఫలంబని నే నెన్నెద.

అస్మత్:— మహాప్రభూ! వీరి యాలోచన ననుసరింతుమేని మన కాయఃవుండునంతలో ఫలము బ్బునని నాకుందోఁపదు. చాందుబీ సామాన్యురాలుగాదు. ఆహారవస్తువు లెన్నిదినంబుల కైన నెప్పుడుంజేర్చియుంచును. అంతకాలమిచట నింతసేనతో మేముండినఁజాలు మనకగును గాని వారికిఁగాదు. అట్టికష్టములకు గురిగాక రయేనష్టము రానీక రాజ్యము సాధించుట యుక్తమని నా తాత్పర్యము.

మిర్జా:— అస్మత్ బేగు! నీవు మాటలలో మూటలుగట్టఁజూచుచున్నావే! ఎంతపిచ్చివాఁడవు? నీ పలుకునంత సులభకార్యంబా యిది?

సీ. అకటి కడరు పంచాస్యసంతతిగాని
సమద సారంగ సంచయముగాదు
ఆజ్యాహుతిని రోజు హవనాగ్నియదిగాని
చంద్రికోద్భవమగు చలువకాదు
బొబ్బలఁ బెంపారు బెబ్బులులవిగాని
తెంపఱు మేఁకల గుంపుగాదు
అంత్యకాలాభ్రనా దార్భటి యగుఁగాని
నారుల మృదువచనమ్ముగాదు

గీ. అమితపటు విక్రమాన్వితు లరులుగాని
గాలములువేయ నాశించు మీలుగాదు
గాలిమాటల మూటలు గట్టనగునె?
యేల యీ రిత్తమాటలు? చాలు వలదు.

అస్మత్ బే:— మహాప్రభూ! నా యాలోచన వింటిరేని నా పలికినంతటి కంటెను సులభమున విప్పని నే నొనరింతును.

మిర్జా.— అదియెటులు?

అస్మత్ బే:— భేదోపాయమున.

మిర్జా:— అదిసాధ్యమా?

అస్మత్ బే:— ద్రవ్యమునకు నెద్ది యసాధ్యము?

మిర్జా:— ఎటుల నీ వీకార్యంబొనరింతువు?

అస్మత్ బే:— మహాప్రభూ! హమ్మీదఖాన్ అను బీజాపూరు సేనాధిపతి నాకు నా బాల్యమిత్రుఁడు. ముప్పదిపదిలులు మూఁడులక్షలదీనారములను వానికివ్వ నమ్ముతింతురేని మీకార్య సాఫల్యమునకు నేను బూటగ నుండుదును.

మిర్జా:— (ఆశ్చర్యపడుచు) ఆస్మర్‌బేగు! నీపలికినటుల కార్యమైన ముప్పదిపల్లెలుగాదు. అరువది పల్లెలిచ్చెదను. మూఁడులక్షల దీనారములుగాదు. ఆఱులక్షలిచ్చెదను.

ఖాన్‌ఖాన్:- మహాప్రభూ! శూరులమై జన్మించి యొకనారిని జయింపలేక ద్రోహమొనరించిరను కళంకము కలకాలము మనలఁగలంచుచుండును.

చం. సరభటకోటి జీవనపుఁబాలిటి మృత్యువు పాదుషాభటా
త్కారమని పన్నె వాసియనుగాంచిన మేమిపు డిట్టిద్రోహముల్
సరియని యొక్కనాతిపయి సల్పఁగఁబూనుదుమయ్య? పాదుషా
దొరమము మెచ్చునే? యశము దూషితకృత్యము దెచ్చునే యిఁక?

ఇది నామన మొప్పనిపని.

ఇబ్రాహీం:-( ఖాన్‌ఖాన్‌నుజూచి ) మిత్రమా! ఏమి మాటలాడెదవు? భేదోపాయము రాజనీతికి దూరమగునే? ఆతంత్రము జక్కఁగఁబచరించికదా మనమనేకయుద్ధములలో వైరులను సాధించితిమి? ఇఁక నిది యబలతో యుద్ధమొకదా నీసందేహము?

తే. గీ. అబలగాదది ప్రబలుర యాయువనెడి
యశనమే భక్షణమ్ముగ నధికపుష్టి
నంది స్త్రీశక్తియని భువి నవతరించు
కాళరాత్రియ సందియమేల? నీకు.

మిర్జా:— ( ఖాన్‌ఖాన్‌నుజూచి ) సేనానీ! మన యిబ్రాహింలోఁడి ఆస్మర్‌బేగు మాటలయందే దోషములేదు. శత్రువుల నే తంత్రముననైన సాధింపనగు ( ఆస్మర్‌బేగునుజూచి ) ఆస్మర్‌బేగు! ఏదీ నీమిత్రుఁడు? వానినిఁ బిలిచికొని వచ్చెదవా?

ఆస్మర్:— మహాప్రభూ! చిత్తము. ( అనుచుఁబోయి హమ్మీదుఖానును బిలిచికొని ప్రవేశించును. )

హమ్మీదు||:- ( మిర్జానుజూచి ) మహాప్రభూ! వందనమ్ములు.

మిర్జా:— సేనానీ! ఆస్మర్‌బేగు నిన్నుగుఱించి మాకుసమస్తము దెలిపినాఁడు మాకార్య సాఫల్యం బయ్యెనేని నీకోరినంతకంటెను హెచ్చుబహుమతి నీకగుననుటకు సందియములేదు.

హమ్మీదు||:- మహాప్రభూ! కార్యసాఫల్యంబు మీకరగతంబని తెలియుఁడు.

మిర్జా:— సేనానీ! నీవేరీతి నిప్పని నొనరింప యత్నించెదవు?

హమ్మీదు||:- మహాప్రభూ! రేపు ప్రాతఃకాలంబున మీరొక రాయబారిని చాందుబీ సభకుఁ బంపవలయును. సేనాసమూహమంతయుఁ దమతమయాయుధములను బాదుషాగారికి నప్పగించినచో నెవరిప్రాణంబునకేయపాయంబు రానటులఁజూచి యహమన్నగరును సామంతరాజధానిగ నొనరించి నెమ్మదిఁగలిగించి పోయెదమని మీరొకజాబు వ్రాయవలెను. మీసేన యంతయుఁ గోటవాకిలివద్దఁ గాచియుండవలెను. సుండెగిరినచప్పుడుకాఁగా వాకిలి తెఱవంబడును. వెంటనే మీసేన లోపలం బ్రవేశింపవలయును. లోపల నేఁ జేయఁదగిన కార్యంబంతయు నొనరించియుండెద.

మిర్జా:— హమ్మదుఖాన్! నీమాటలు విశ్వసించి నీవు చెప్పినభంగిఁ జేయించెద. జాగరూకుఁడవై నీయత్నంబున నీవుండుము. నీకిదె బహుమానంబుఁ గార్యానంతరం బొసఁగుదును.

హమ్మదు:—మహాప్రభూ! కార్యం బెట్లయిన సాధించెద. ఇపుడు వోయివచ్చెద. వందనంబులిడెద.

(నిష్క్రమించును.)

అస్మత్ బేగ్:—(హమ్మదు వెంబడనంటి) మిత్రమా! నేఁగోరిన కోరిక సఫలంబు జేయునది నినుఁ గూడిన భారము.

హమ్మదు:—మిత్రమా! సమయము సమకూడినపుడే కార్యంబు సవరించికొను భారము నీయది.

అస్మత్ బేగ్:—అట్టిసమయముఁ దటస్థింపఁ జేయునది నీభారము.

హమ్మదు:—మంచిది మిత్రమా! నేఁబోయివచ్చెద. నీవు సెలవిమ్ము.

(నిష్క్రమించును.)

ఖాన్‌ఖాన్:—ఇట్టిద్రోహులుండిన రాజ్యమునం దెట్టి యిక్కట్టులకు నెగ్గెలంతయునుండదు. ఇట్టివారి ముఖావలోకనము జేయరాదు.

మిర్జా:— నీమాటల కేమి? రాజ్యము సాధించుటకు యిప్పట్టున మనుటకు సందియంబు లేదు. నేను రాయబారిని బంపుటకుఁ దినదోస్తా బోనరించవలయును. అటులనే జాబు వ్రాయింపవలెను. ఇపుడు వెళ్లుదము.

(నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

సుల్తానాచాందుబీ - జోరియా - అబిస్సుఖాన్ - హమ్మదుఖాన్,

రాయబారి.

సుల్తానా:—ఉ. కీడగుకాలమయ్యె! కలిగెన్మనకున్, సఖులార! విక్రమం
బూడెను వీరశూరులగు యోధులయందు, సమస్త సేనయున్
వాడె వినక్రమంబుగను వర్తకులెల్లరు వీడి రీపురం
బాడఁగ నేమి? నామదికి నంతయుఁ జేడ్పడినట్టు తోఁచెడిన్.

(చింతనభినయించి) సేనానులారా! అదియేమి కతముననోగాని నిన్నటిరేయినుండి నా మానసము శోకానలజ్వాలలచే శోషించుచున్నది. నాప్రియజనులను జూచినకొలఁదియు నేఁడా శోకంబాజ్యాహుతి ప్రవర్ధమాన దహనాకృతిని వర్ధిల్లుచున్నయది. నాపోషణ ప్రేమణోప లాలనములఁ బెద్దఁబెఱిగినజనులంజూచి యకటా! తల్లి లేనిపిల్లలగుదురే వీరని చింతిల్లుచున్నదానను. యుద్ధమనిన రెండుభుజములు వాల్గుచున్న నేను రణభీరువనైతిని. పుత్త్ర వియోగమున దుఃఖించుతల్లి మాడ్కిఁ గళవళ మొందుచున్నాను. హా! హా! నేఁబట్టిన పట్టికిఁబట్టము విలుచునో? పరరాజుల పాలగునో?

ఉ. పుట్టినయింటి నీపమిటు పోయెడి కాలము సంభవించె నీ
పట్టకి రాజ్యపట్ట మెటు పట్టుగ నిల్చునొ? యక్కటక్కటా!
కట్టడిదైవ మీగతిఁ గన్నరఁగూర్చెను క్రూరశత్రువుల్
చెట్టుపు గుట్టుసైబఁచి చేష్టడఁజేయుదు రేమొ యోసినన్?

జోరియా:--తల్లీ! యుద్ధయత్నంబునం జేసి నిదురలేక శరీరాయాసంబు మితిమీఱి నీసీరీతిఁ బల్లసిల్లెన
వని నాకుఁదోఁచెడి. కొంత విశ్రమించుకొనిన బాగుగనుండును.

కం. మతిచెడును నిదుర చెడినన్
ధృతిపీడును భీతిమూఁడు ధీరుస్యకెఁన్
జతురతఁజను వినుమా నీ
సుతమాటలు నిద్రఁబొమ్మ సుఖమొసఁగూడున్.

అదీస్సు:— మాతా! అసమాన శౌర్యవిక్రమవంగులై మాబోటివారిందఱు నీపుత్రులుండ నీవీరీతి దుఃఖ
బాష్పాప్లుతాస్యవై శోకింపఁదగునా? శోకము సుఖముచెఱచు, తేజంబునడఁచు,
బుద్ధిఁబోకార్చునను పెద్దలవాక్యము వినవా?

హామ్మదు:—ఎన్నఁడును వినిరాయుంగని ఖిన్నత నేఁడేల మీకుసంభవించెను? మనసేన స్వల్పముగ నున్న
దనియా? సేన స్వల్పమైనను శూరత్వము సన్నగిల్లెనా?

మ. రిపుసేనాంబుధి కుంభజోద్భవులు వైరిప్రాణ కాలాంతకుల్
విపులారాతి వనాటవీశిఖులు విద్వేషాంధ కారారుణుల్
విపరీతారి ఘనాళిమారుతులు గర్వీభూత ప్రత్యర్థి భూ
మిప సర్పాళిఖగేశ్వరుల్ దెలియవా మీయోధులి ధారణిన్?

తల్లీ! మీయోధుల పరాక్రమంబు నీవెఱుంగవా? ఎఱిఁగియు నేలచింతించెదవు? బీజాపూ
రునుండి మనకేసాహాయ్యము రాదనియా?

క. అరివహ్ని పురినిఁ గాల్పను
సరసన్ గదియంగ దాని సరకుఁగొనక ని
ద్దురపట్టునె? విక్రమ కం
ధరవారినిఁగార్చి యార్చి తనియక యున్నన్.

శూరత్వము ప్రాధాన్యముగాని సహాయసంపద ముఖ్యతగాదు. దానికిం జింతింపవలదు.
శార్యతంబులు దరినుండుతఱి ద్విరదంబులుమదించి చెలరేఁగుచుండును.

చాందబీ:-- పుత్రులారా! మీప్రోత్సాహపు మాటలు వినిముదమందితినైనను నేనిప్పటి స్థితి గనులఁ
జక్కఁగ నాలోచించి యుద్ధంబు హితంబుగాదని తలంచితి.

(భటుని ప్రవేశము).

భటుడు:—(వందనంబులిడి) తల్లీ! బాదుషాగారినుండి రాయబారియొకఁడువచ్చి తమదర్శనంబుఁ
గోరుచున్నవాఁడు.

చాందుబీ:-- ఏమీ! పాదుషా కొమారునుండి రాయబారివచ్చినాఁడా? సంతోషము (అబిస్సీనియానుఁ జూచి) అబిస్సీ! నీవు వెళ్ళి రాయబారినిచ్చటికింబంపి దక్షిణపుదిక్కునఁ గోటపై ఫిరంగుల నెక్కించు పనిముగింపుము. రాయబారి సంధికి వచ్చియుండిన సందటికి మేలగు.

అబిస్సీ:— (సలామొనరించి) తమయానతి శిరసావహించి చేసెద.

(నిష్క్రమించును).

[ రాయబారి ప్రవేశము ]

రాయబారి:-(చాందబీకి నమస్కరించును)

చాందుబీ.-- రాయబారి గారూ? కూర్చుండుఁడు. మీయేలికకు క్షేమమా?

రాయబారి:-తల్లీ! పెద్దలయమోఘాశీర్వాదఫలంబున మారాజునకును నతని పోష్యవర్గమునకును క్షేమమా?

చాందుబీ:-- రాయభారి! ఇపుడు నీరాకకుఁ గతంబేమి?

రాయబారి:-మాతా! మాప్రభువు మీకందించుమనటుల యీజాబునిచ్చినాఁడు. (జాబందించును).

చాందుబీ:-- [చాందబీయందికొని జోరియాచేతికిచ్చి] ఏదీ? ఈజాబు జదువుము.

జోరియా:—[జాబువిచ్చి చదువును].

"ఘనతఁజెందిన సుల్తానా చాందుబీ గారికి"

ఢిల్లీపాదుషా కుమారశేఖరులయిన డానియల్ మిర్జా, మూరాదుగారు చేయువరులు ఇది వఱకు మామీ యుభయ రాజ్యముల మేలునకు మున్నుమునచే నొనరింపంబడిన యొడంబడికలకు వ్యతిరిక్తముగ మీసామంత రాజులు నడచుకొన్నందున మరల నీయుద్ధ ప్రసక్తి కలిగెనని మీకిదివఱకే తెలిపినారముగదా? అట్టి కట్టుబాటులను ధిక్కరించితిరేయని మాభటులు నీపురంబుఁజేరి మీకోటపైఁబడి మదాంధీభూతదుష్టాశయులైన మీభటులను సంహరించి మీరాజ్యలక్ష్మినిఁ జూఱఁగొన యత్నించుచున్నవారు. ఈయుద్యమంబున విఫలమనోరథులమైతిమేని సంవత్సరములకొలఁది గోటనుముట్టడించి మీకేవిధమైన యాహార వస్తువులుఁ జేరనీక లోపలనే మీరెల్లరు సమయులాగొనరింప నిర్ధరించినారు. ఈనిర్ధారణంబునకు ఘనతకెక్కిన పాదుషాగారు సమ్మతించి లక్షసేన నుపబలముగఁ బంపనున్నారు. ఇంతటి సాహాయ్యసంపద మాకున్నను దరిద్రులులేక యనన్యగతికుఁడగు నాకబాలునిపైజాలిచే భూతదయా సమేతలగు మీరిన్నికష్టంబులు పడుచున్నవారేయని కరుణించి యీజాబు వ్రాయించినారము సర్వతోముఖంబగు లోకానుభవజ్ఞానంబుగల మీరిందుల తాత్పర్యంబుఁ జక్కఁగనాలోచించి మీయాయుధములన్నియును మావశపఱచి మాపాదుషాగారికి లోఁబడిన సామంతరాజ్యముగ మీదేశంబు సేయ నొడంబడితిరేని యిప్పుడే మీబాలుని రాజుగ మేమంగీకరించి యుద్ధయత్నంబుమాని మాపురిఁ జేరుదుము అదికాదంటిరేని నీయుద్ధంబున సంభవించు మారణకృత్యంబునకు, భూలోకదైవమైన పాదుషాగారికిని బరలోకదైవమునకును మీరేయుత్తరవాదులై యుండవలయుటసత్యము. ఇందులకు బదులుగోరు

డానియల్ మిర్జా, మూరాదు.

చాందుబీ:-- ( ఇంచుక చింతించి ) హా కష్టము! ( హమ్మీదుఖానుఁ జూచి ) వింటివే సేనానీ! ఈజాబు నందలి యుదంతము మిర్జాగారు వ్రాసిన దంతయు మనకు హితమ్మయని నాకుం దోఁచెడు. ( మరలనించుక యాలోచించి ) సేనాధిపతీ! ఎంతదూరమాలోచించినను వారు వ్రాయించిన హితమే సర్వహితమ్మని నాకుం దోఁచెడు.

హమ్మీదు:— ( కినుకతో ) ఈ హితమ్ము నాకహితమ్ము.

కం. వెడమాటలాడ నీభటుఁ
డొడఁబడునే! వలదు సంధి; యుద్ధము నాకున్
దోడవుగ నుండును జయమును
బడసెద రిపుసేన నడఁచి ప్రజలు నుతింపన్.

నాకు యుద్ధమే సమ్మతము.

చాందుబీ:-- ( రాయబారిం జూచి ) అయ్యా! మీరిపుడు వెళ్ళుఁడు. రేపటిదినంబున మీరాజుగారి జాబునకు బదులు బంపెద.

రాయభారి:- చిత్తము ( వందనంబులిడి నిష్క్రమించును )

చాందుబీ:- ( హమ్మీదునుజూచి ) సేనానీ!

ఉ. నెమ్మదిఁ జక్కఁగాఁ దలఁచి నీవు వచింపుము మిత్రమా? సమ
స్తమ్ము నెఱింగినట్టి భుజసత్త్వుఁడవీవు నిజమ్ము నీభటుల్
బమ్మెరపోరు పోరునను వాస్తవమిద్దియు నైన సంధి తే
మమ్మని నాకుఁ దోఁచెడిఁ గుమారు హితమ్మెదఁ బూని చూచినన్.

మిత్రమా! ఇప్పటికి మన యాయుధములన్నియునుఁ బరరాజువశపడుచుట హితమని నాకుం దోఁచెడి. అరీతిని బదులు జాబు వ్రాయించెద.

హమ్మీదు:— శా. ఏమీ? యెంతటిమాటలాడితివి? తల్లీ? సత్త్వసంపన్నతన్
భూమిన్ ఖ్యాతినిఁ గాంచినట్టి భటుల న్యూభరి ప్రతాపాఢ్యులన్
భామాసంఘముఁ బోలెఁ జూడనగునే? ప్రాణంబుకంటె న్గడున్
నేమంబూనుచుఁ జూచు నాయుధతతిన్ నేల్పాలు గావింతునే?

ఇదిరొప్పనిపని (అని యటులిటులఁ జూచి) వెలుపట చాలగద్దలమగుచున్నది. అదియేమో చూచివచ్చెద.

( నిష్క్రమించును )

చాందుబీ:- ( జోరియాం జూచి ) జోరియా! ఈసేనానిచర్య విచిత్రముగనున్నయది. వీఁడేమాకు మృత్యువగునని తోఁచెడి.

( వెలుపట గట్టిగ ఛీల వేసిన శబ్దము వినఁబడును పిమ్మట గుండెగిరిన శబ్దము వచ్చును వెంటనే దీన్ దీన్ యని సేనలోనఁ బ్రవేశించును )

( సేనలోఁ బ్రవేశించి ) వీడి! యాచాండాలి చాందుబీ? కుంటలు కుంటలుగ నఱికెదము.

ఆయుధముల నాయూవుండనప్పుడు నేలవిడఁజనియెంగాని కూసెను? ( అనుచుఁ వాండు దీని సమీపించి హమ్మీదు బాకుచేఁ బొడుచును )

జోరియా:- ఓరీ! చండాలులారా? నాతల్లినిఁ జంపఁబ్రయత్నించెదరా? అనుచుఁ దన బాకుచేఁ దీసి హమ్మీదుఖాన్ను నెదపైఁ బొడువ వాఁడు హాయని నేలపైఁ బడును. అకస్మాలంబున వెనుకనుండి యాస్మాన్ బేగు ప్రవేశించి జోరియానెత్తికొనిపోవును. పాదుషాసేనయు నాబీసీనియన్ సేనయు గృహములు కొల్లగొట్టఁబోవుదురు.

(అబిస్ఖాన్ సేనలోఁ బ్రవేశము)

అబిస్సు:— ఏమియిది! ఇంతటిలోనింత యల్లకల్లోలమైనది సుల్తానాచాంకుబీ యేది? నా జోరియా కానరాదేల?

(అబిస్సుఖాన్ సేవకుఁడు ప్రవేశించి)

సేవకుఁడు:— తండ్రీ! జోరియా నెవఁడో యెత్తికొని పోవుచున్నాఁడు.

అబిస్సు:— ఏమీ! జోరియా నెత్తికొని పోవుచున్నాఁడా? ఎవఁడువాఁడు? వద చూపుము? (నిష్క్రమించి జోరియా నెత్తికొనిపోవు యాస్మాన్ బేగునుబట్టి పొడువవాఁడు నేలపైఁబడును)

జోరియ:—[అబిస్సుఖానుని జేరి కన్నీరు గార్చుచు] ప్రాణకాంతా! నన్నికలుషాత్ముని బారినుండి రక్షించితివేని పూర్వజన్మమున నేనెన్ని పాతకంబు లొనరించితినో తెలియదు?

అబిస్సు:— [జోరియా కన్నీరుఁదుడిచి అస్మాన్ బేగునుఁజూచి కదలి]
ఓరీ! నీవెవఁడవు శార్దూలంబున్న పొదలో సారంగము చొచ్చినరీతి నేల యిచటికి వచ్చితివి?

అస్మాన్ బే:— అబీసు! నేనస్మాన్ బేగును నా ప్రాణములు పోవుపోటు పొడిచితివి. నారొనరించిన ద్రోహఫలంబిపుడే ననుభవించెద. దుష్టప్రవర్తనము ప్రాణనష్టమునునది సిద్ధాంతంబయ్యె. అకారణవైరంబు నీపై సాధించితి. ఈతరుణిని నీనతీమణినిఁ గన్నహింసలఁబెట్టితి. అదియిది నేనితివన నేల? తనయునిబలె ననుఁ బెంచిన తల్లిసమానురాలిని జంపంబూనితి నానుండి యహమ్మదునగరు, బీజాపూరులను రెండు రాజ్యములు చెడెను.

జోరియా:— ఏమీ? వీఁడా ఖలుఁ డస్మాన్ బేగా? నన్ను నాఁడాయవస్థలంబెట్టిన యవాచ్యుండా?
[అనుచు దూరముజరుగును]

అస్మాన్ బే:— సతీమణీ! ఆపాపాత్ముఁడనే నేను. ఇపుడు నిన్నుంబట్టియీడ్చికొనివచ్చిన దుశ్చరితుండనే నేను.

అబిస్సు:— ఓరీద్రోహీ! నీవు లోపలకెటు ప్రవేశించితివి?

అస్మాన్ బే:— మీ సేనాధిపతియగు హమ్మదుఖానును లోఁబఱచికొని పాదుషాకుతుని వద్దకుంగొనిచని వానికి ద్రవ్యాశఁగల్పించి యొకవిధమైన చప్పుడు లోనుండి వచ్చినతోడనె కోటవాకిలి తెఱుదునటు లేర్పాటొనరించితి నేఁడా వాకిలి, గుండుశబ్దము వెంటనే తెఱవంబడెను. పాదుషా సేనంగూడి లోపలికిం బ్రవేశించి జోరియానెత్తికొని పోవుచుంటిని. ఇకమాట లాడనాకుఁ బ్రాణలేదు [అనుచు మూరకుందును]

అబిస్సు:— [జోరియానుఁజూచి] కాంతా! అంతయు మోసమాయెను నేనతిత్వరంబో యెదిరియెటు లంబోనీ యాహమ్మదుఖాన్నుబట్టి చంపెద.

జోరియా:— ~~స్వామీ! అకార్య~~ర్యంబే నప్పుడే యొనరించినదానను.

అబిస్సు:— ఏలాగున?

జోరియా:--ఆద్రోహి నాతల్లి సుల్తానాచాందుబీని చావఁబొడిచెను. దానింజూడనోపక యచ్చటే నే నీఘాతుకునిం బొడిచితి. ఆయుమునకుం దరిలి నేలంబడి వాఁడు ప్రాణంబులు విడిచె.

అబీసు:-- [విస్మయవ్యసనంబు లభినయించుచు] సతీమణీ! ఆద్రోహి నీచేఁ జంపబడె నను వార్తవిని సంతసించితి. హా హా! మనతల్లి చాందుబీగతి యేమయినదో యని విచారపడుచున్నాఁడను.

జోరియా:--నాకును నద్దియె విచారంబు. ఈపాపిసరప నిలువంబునను నీనిందొలంగి మనతల్లివద్దకుం బోవుదము.

(నిష్క్రమింతురు.)

ఆ ఱ వ రం గ ము.

అహమ్మన్నగరు.

సుల్తానాచాందుబీ మంచముమీద పరుండి యుండును.

అబీసుఖాన్ - జోరియా - బహదూరు - ఆల్మేడ.

అబీసు:-- [చాందుబీనిఁజూచి] మాతా! మాటాడవేల? నాయొనర్చిన తప్పేమి? ఏల యీకోపము? పరరాజభటులుక్కుమీఱి లగ్గలకెక్కి వచ్చుచున్నవారు వారిని నీకరవాలమ్మునఁ ద్రుంచక యూరక యుపేక్ష చేసెదవేల?

సీ. రిపునారివితతికిఁ గంఠపాశముగదా
గణుతింప నీచేతి ఖడ్గలతిక?
కుహకశత్రుల వ్రాత కఠినాగ్ని యగుఁగదా
తల్లిరో నీదుప్రతాపవహ్ని
ప్రతిపక్షపర్వతా పాతవజ్రముగదా
అమ్మ నీ శరనిచయమ్ము గాంచ
ప్రత్యర్థిలోకావ న్మృత్యువయ్యెనుగదా
జనని! నీయేష భాషణముభువిని

గీ. ఇట్టిధీరవునీవయి యిపుడు కలను
కెక్కి వచ్చెడి వైరుల యుక్కడింప
కిట్టుల శయనమ్ముఁ జేరితివేల? మాత!
నన్నుఁగృపఁగని పలుకవే కన్నతల్లి?

తల్లీ! నీవిట్లూరకున్న వహించినచో నీసోదర్యవర్గమునంజేరిన భటసమితి మూలము తెగిన మహీజముఁబోలె నేలఁబడదా? మాతా! నీయూతసాన్నిధ్యము లేకితంయిన నెల్లరు సరస్వతి తోని సుఖములరీతి కీర్తిహీనులు గాకయున్నవారు. ఇనదీప్తి లేనిదినము ఘనత కెక్కునా? తల్లీ! ప్రాగద్రి వావరింపఁబడిన దీపకళికలంబలె వాస్యశ్రీకాంతివీడి వగల్చ బొగలుచు నేమిసేయను జేతులాడక నీసేవకులు నీయాజ్ఞారూపకముగ భ్రూసంజ్ఞకు నెదురుచూచుచు నిలిచియున్నవారు. వారిపై నేలదయరాదు?

జోరియా:--[చాందుబీనిఁజూచి] అమ్మా! నీముద్దులబిడ్డను జోరియానునీ సన్నిధికివచ్చి నినుసేవింప నిలిచిన నాకను ఏమిసేయుటావతిచ్చెదవు? (ఇంచుకోలిచి) తల్లీ! మాటాడవేల?

సీ. స్ఫురుచిరసల్లాప సుఖసుధానిధిముంచి
నింపాదిగాఁ గౌఁగిలింపవేమి?

మధురసధురమగు నధరంబు కదలంగ
నింపుగా ననుఁబల్కరింపవేమి!
రాజకీయవిచార యోజనల్సలుపంగ
నంపుతోడుగ నియమింపవేమి!
శంపారుచులమించి కెంపారు క్రేఁగంటి
పెంపౌ చూడ్కులు నుంపవేమి

గీ. తల్లి యిదియెంత చిత్రంబు! తనయవచ్చి
నీదుసన్నిధి వలవంత నిలిచియుండఁ
జేర రాఁబిల్చి యూఱటఁ జెప్పవలదె?
మేల యింతటి కోపంబు బాలపైన?

తల్లీ! అలనాఁడా కలుషాత్ముఁడు దుష్టాశయుఁడై పేరోలగంబున నభలాపంబులాడినతఱిఁ గరుణార్ద్రహృదయమున ననుఁగాపాడినకృపాకటాక్ష వీక్షణంబులు నేఁడేల యీదీనురాలినుండి మరల్చితివి? మాతా! రూపసమృద్ధిచే వివేకబుద్ధిచే చిత్తసంశుద్ధిచే జగత్ప్రసిద్ధికెక్కు సుగుణవృద్ధురాలగు నినుబోలు సుగుణఖనిజనని నాకు నెందేనిదొరకునా? తల్లీ! తావనిబాలుఁడు నిప్పుట్టినంటి మొలక. నీసుగుణి మాటలలాలింపవేల? ఆబాలుఁ డేమి నేరము తీకొనరించెను? నీమొగముపై దృష్టిసారించి కన్నీరుగార్చుచు వీచిరునగవునకు వేచియున్నవాఁడు, వానిని సరసకుఁదీసి సరసాలాపములఁ బుజ్జగింపరాదా?

బహాదూరు:-(లేచి సరసకుంజని చాందుబీనంటి) అమ్మా!

శా. తల్లీ! మంతులొనర్చి నే నెఱుఁగ నాతప్పేమియున్ లేదుగా!
కల్లల్పల్కను తోడిబాలురకు నే కష్టంబులన్ గూర్పనే
చెల్లాటంబులుసల్ప సేవకుల కేచెడ్డేమియున్ జేయ నీ
యుల్లంబందున నే మెఱింగితివొ? మేలొప్పంగ శిక్షింపవే.

అమ్మా! నీయాసతిమీఁతి నిఁగాదని నాయెనరించిన నేరమేమి! మాటలాడవేల! తల్లీ?

కం. తియ్యనిపలుకుల నిటు రా
వయ్యా బహాదూరటంచు నక్కటికముగన్
నెయ్యము నెఱపుచుఁ బిలువవె
చయ్యన నను గౌఁగిలించి చనువు సలుపవే.

(అనుచు చాందుబీపై వ్రాలును)

చాందుబీ:—(మూర్ఛఁదెలిసి మెత్తగ లేచి) బహద్దూరు! ఇటుకూర్చుండుము, నాయనా బహదూరు! కన్నీరుగార్చెదవేల? తాలఁడిల్లుము. ఇఁకనీతలిదండ్రులు ఏలేయనివమ్మెదు (అభిమ్పభోగుము, జోరియానుజాపును) అబీసు (జోరింయానుజాచి) అబీసు! జోరియా! [illegible] వింకమీరే జననీజనకులు. నాకథమాత్రము కాలము తటస్థించెను. [illegible] జాల. వీనిని నీకపదస్థునిఁ జేయు భారము మీయది మిము [illegible] నాపుట్టినింటి మొలకను బెంచి పెద్దఁజేయుఁడి. ఈ నాపుట్టినింటి [illegible] లొనరింపుఁడి. ఇది నాకోరిక. [illegible] యుండిన నను క్షమింపుఁడి (అశ్రుధారలు జారి) [illegible]

నే నేమి చెప్పంగలను? మీ రెటులయినఁ బాదుషా సుతునిసరసనకుంజని యుద్ధమునిలిపి బహా దూరుకి పట్టంబుగట్టింప బీబియూవచ్చుకి ధారవోయుడి. ఈనాకథకు నీవిషయంబున మీరు సాహాయ్యకర్తలని జగత్ప్రసిద్ధిఁగనుఁడి (అబీబునుఁజూచి) అబీబ్సు! సమస్త దేవాలయము లందు నీవినకు సర్వమతైక బ్రహ్మముగు బ్రహ్మమును నుతించులాగొనరింపుము. ఈ బాలువిఁ బిలిదికొనిపొమ్ము. (పరుండును)

అబీబ్సు:— హా హా! విధిమాయ నైన రెఱుంగు నరు?

సీ. దీనజనావనదీక్ష నేమిఅదాయె
నీసాధ్వి తరళతరేక్షణమ్ము
మలినాశయుల శిక్ష ముఅవఁజాలని
దాయె నీ మానినీమణి నేమబలము
కల్లనైనఁగల్లలు పలుకనేరనిదాయె
నీలోకమాన్య యహీనజిహ్వ
దుష్టా ఖండనఁ దుష్టిఁజెందనిదాయె
నీనాతి సంశుద్ధమానసంబు

గీ. ఇట్టి సుగుణాలవాలకు నిట్టిశౌర్య
నిధికి సంకటమిట్టుల నివ్వటిల్లె
తుచ్ఛమానవునకుఁ జిక్కితొలఁగెసుగము
సింగ మిల నొక్కనక్కకుఁ జిక్కునటుల.

ఆత్మేద:— అబిబ్సుఖాన్! గతమునకు వెతఁజెందుట కూరసమ్మతము గాదు ఈవీరమాత హాయిగ నిద్రిం పనిమ్ము బ్రదికినచో మనభాగ్యము కానిచో దైవయోగ్యము. మనమిచట నిలిచి ధ్వని సేయుచున్నచో రాణిగారి నెమ్మదికి భంగముగును. అందఱు వెలివెడలి యెల్లవారిని రక్షించు దైవమును బ్రార్థింతము.

(అబిబ్సు, జోరియా, బహదూరు, ఆత్మేదా వెలివచ్చిదేవ ప్రార్థన సేయుదురు)

సీ. శరణోహ మనియెద సర్వలోకాతీత
శరణముగల మహాకరుణానిధికి
ఆచరించెద నతు లఘువిమోచనకర
లోచనామృత శ్రితసేవకునకు
వందనంబిడెద నావందితవందారు
బృందునకును గుణానందునకును
కరములుమోడ్చెదఁ గమనీయగుణగణా
కరునకు ఖలనాశకరునకెలమి

గీ. మ్రొక్కులిడెద నెవఁడు ముజ్జగంబులనేలు
నొక్కడయ్యుని, యెక్కయక్కరమున
సూక్ష్మముగనునిలిచి స్థూలమై వెలివడు
వాని కిపుడు పాపహాని కెపుడు. (నిష్క్రమము.)

# ప్రకటన.

బళ్లారిలో వకీలుగానుండి కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచియింపబడిన యీక్రింద వివరించిన నాటకములన్నియును విక్రయమునకు సిద్ధముగనున్నయవి.

## నాటకముల వివరము.

1. రామరాజు చరిత్రము
2. సుల్తానా చాందుబీ
3. శిలాదిత్య
4. ప్రతాపాక్బరీయము
5. మైసూరు రాజ్యము
6. చంద్రగిర్యభ్యుదయము
7. సుఖమంజరీపరిణయము
8. సునందనీపరిణయము
9. యువతీవివాహము
10. సీమంతినీ పరిణయము
11. మదాలసానాటకము
12. రుక్మాంగదనాటకము
13. సత్యహరిశ్చంద్రీయము
14. గిరిజాకల్యాణము
15. కాళిదాసనాటకము
16. మానవపిశాచనాటకము
17. మానాపమానము
18. చంద్రహాసనాటకము
19. ప్రహ్లాదచరిత్రము
20. ద్రౌపదీమానసంరక్షణము
21. కీచకవధ
22. శిరోమణినాటకము
23. బభ్రువాహననాటకము
24. శ్రీరామజననము
25. సీతాకల్యాణము
26. పాదుకాపట్టాభిషేకము
27. లంకాదహనము
28. కుశలవనాటకము

## ప్రహసనములు.

1. ఆచారమ్మకథ (కన్నడభాషలో) 2. అన్యాయధన్యపురిమహిమ 3. నాచిపాక్షి

ఆంగ్లీకృతాగస్త్య భారతము ( పద్యకావ్యము ) సభాపర్వమువరకు

Dramatic History of the world ( in English )

కావలయువారు ఈక్రింది చిరునామాకు వ్రాయవలయును.

కె. శత్రుఘ్నరావు,

సివిల్ లైన్సు, బళ్లారి.